ఆదివారం 9 జూలై 2017 ఆంధ్రజ్యోతి
sunday magazine





# మనుషులే... పుస్తకాలైతే!










ఫిల్మ్ నగర్

**సినీతారలు మనోళ్లకు దేవుళ్లతో సమానం. వారి కోసం ఏమైనా చేసే అభిమానులు కోకొల్లలు. అభిమాన తారలకు గుళ్లు కట్టినవారు కొందరైతే, వారి కోసం గుండు కొట్టించుకున్నవారు మరికొందరు. 'స్టార్స్' చరిష్మా అక్కడితోనే ఆగిపోలేదు. వారి వారి సినిమాల పేర్లతో రెస్టారెంట్లు, ఫుడ్ ఐటెమ్స్ కూడా సూపర్‌హిట్ అవుతున్నాయి.**

ఈమధ్య దక్షిణ ముంబయిలో షూటింగ్ ముగించుకుని కారులో ఇంటికి వెళ్తున్న దీపికాపదుకొనే దృష్టి ఒక బోర్డుపై పడింది. దాని మీద 'తంగబలి' అని రాసుంది. అదొక సౌతిండియన్ రెస్టారెంట్‌కు పెట్టిన పేరు. ఆ పదం 'చైన్నె ఎక్స్‌ప్రెస్'లో మీనమ్మ (దీపిక) నోటివెంట బాగా పాపులరయ్యింది. అదే పదంతో ఒక రెస్టారెంట్ కనిపించడంతో దీపిక ఉబ్బితబ్బిబ్బయ్యింది. తనకిష్టమైన దక్షిణాది రుచులను ఆస్వాదించేందుకు త్వరలోనే 'తంగబలి' రెస్టారెంట్‌కు వెళ్తానని కూడా తెలిపింది.

కండలవీరుడు సల్మాన్‌ఖాన్ పేరిట ముంబయిలోని ఖార్ వెస్ట్‌లో ఒక రెస్టారెంట్ ఉంది. దాని పేరు 'భాయ్‌జాన్జ్'. సల్మాన్ 'భజరంగీ భాయ్‌జాన్' సినిమాపై అభిమానంతో ఆ రెస్టారెంట్‌ను ప్రారంభించారు. ఒక్కో సినిమాలో సల్లూభాయ్ స్టయిల్‌ను ప్రతిబింబిస్తూ పోస్టర్లుంటాయి. సల్మాన్ సినిమాలు విడుదలైన తేదీలను సూచించే నెంబర్లున్న పది రూపాయల నోట్లను రెస్టారెంట్ నిర్వాహకులు సేకరించి, వాటిని ప్రదర్శించడం మరో విశేషం.

అమితాబ్ బచ్చన్, ధర్మేంద్ర నటించిన బ్లాక్‌బస్టర్ మూవీ 'షోలే' పేరిట కూడా హైదరాబాద్‌లోని బేగంపేటలో, లాస్‌వెగాస్‌లో రెస్టారెంట్లు ఉన్నాయి. రెస్టారెంట్ గోడలపై 'షోలే'లోని సీన్లు ఆకర్షణీయంగా కనిపిస్తాయి. ఈ రెస్టారెంట్లలో భారీ తెరపై సినిమాలోని ఆసక్తికర సన్నివేశాలు చూస్తూ ఫుడ్ ఎంజాయ్ చేయొచ్చు. అదేవిధంగా సెంట్రల్ ఢిల్లీలోని కనాట్ ప్లేస్‌లో మిక్కీ మెహతా, ఉమాంగ్ తివారీ అనే ఇద్దరు ధర్మేంద్ర వీరాభిమానులు ఆయన పేరిట 'గరమ్ ధరమ్' ధాబాను నడుపుతున్నారు. సికింద్రాబాద్‌లో అలనాటి క్లాసిక్ 'మాయాబజార్' పేరిట ఒక రెస్టారెంట్ ఉంది. ఎస్వీరంగారావు 'వివాహభోజనంబు... వింతైన వంటకంబు...' స్టిల్స్ గోడలపై దర్శనమిస్తాయి. ఇదిలా ఉంటే 'చెన్నై చెట్టినాడ్ ప్యాలెస్'లో 'బాహుబలి మహా బఫెట్' మెనూకార్డు ఇటీవల సోషల్ మీడియాలో చక్కర్లు కొడుతోంది. అవంతిక ఆలూ గోబీ ఫ్రై, బల్లాలదేవ బజ్జీలు, దేవసేన పన్నీర్ మకానీ, కట్టప్ప తందూరీ కబాబ్స్, శివగామీ స్పెషల్ మసాల దోశ, మాహిష్మతి మిఠాయి, బాహుబలి చికెన్ 65 ఉండటం విశేషం. ❋





# 'టేస్టీ' ఫ్యాన్స్!






# INSIDE





**మనుషులే పుస్తకాలైతే!**

మానవ లైబ్రరీలు మస్తకాల్ని పుస్తకాలుగా మార్చేస్తున్నాయి. ప్రతి జీవితం ఓ గ్రంథమే అవుతోంది. ఆ అనుభవాల్లో వేయి విజ్ఞానసర్వస్వాల సారం. 7



**ఆది పినిశెట్టి**

మృగం, వైశాలి, మరకతమణి వంటి తమిళ అనువాదాలతో తెలుగు ప్రేక్షకులను ఆకట్టుకున్నాడు ఆది పినిశెట్టి. 'సరైనోడు' సక్సెస్ తర్వాత తెలుగులోనూ బిజీ అయ్యాడు. 12

మీ అభిప్రాయాలను పోస్టు ద్వారా **ఆదివారం ఆంధ్రజ్యోతి**, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33కు, మెయిల్ ద్వారా sunday.aj@gmail.comకు పంపండి.



## మిత్రవాక్యం

**పొ**ద్దున్నే మార్నింగ్‌వాక్ బయల్దేరతాం. ఓ దగ్గర పూల మొక్క కనిపిస్తుంది. అప్పుడే విరిసిన లేత గులాబీని కాసేపు మురిపెంగా చూసి ముందుకెళ్తాం. కాస్తంత దూరం వెళ్లాక చెత్తకుప్ప కనబడుతుంది. తల తిప్పుకుని వెళ్తాం. నాలుగు అడుగులు వేయగానే... బుజ్జి కుక్కపిల్ల నడిరోడ్డు మీద బిత్తర చూపులు చూస్తూ కనబడుతుంది. భద్రంగా రోడ్డు దాటించి మరీ ముందుకెళ్తాం. అంతలోనే ఏ విష కీటకమో మన వైపు వస్తున్నట్టు అనిపిస్తుంది. చేతితో అదిలించో, నోటితో బెదిరించో దారి మళ్లిస్తాం. ఆ మలుపు దాటుతుండగానే ఆత్మీయుడు ఎదురొస్తాడు. ఆ మనిషిని చూడగానే ఎక్కడలేని ఆనందం కలుగుతుంది. కళ్లలో కొత్త వెలుగేదో జిగేలుమంటుంది. అభిమానంగా అతడివైపు అడుగేస్తాం. ఆలింగనంతోనో, కరచాలనంతోనో ప్రేమాభిమానాల్ని వ్యక్తం చేస్తాం. కుశల ప్రశ్నలతో క్షేమసమాచారం తెలుసుకుంటాం. 'మళ్లీ కలుద్దాం...' అన్న ఆశావాద ప్రకటనతో వీడ్కోలు తీసుకుంటాం. హఠాత్తుగా మన ముఖ కవళికలు మారిపోతాయి. ఎదురుగా.. జిత్తులమారి నక్కలాంటి వ్యక్తి. అతడి ఉనికినే విస్మరించి మన మానాన మనం వెళ్లిపోతాం. బతుకు ప్రయాణంలోనూ ఇదే సూత్రాన్ని పాటించాలి. రకరకాల అనుభవాలు ఎదురవుతుంటాయి. అన్నింటినీ బుర్రకు ఎక్కించుకోకుండా, మనకు ఇష్టమైన దాన్నే మనసులోకి తీసుకోవాలి. అప్పుడే జీవనయాత్ర.... వ్యాహ్యాళిలా కులాసాగా సాగిపోతుంది. ■



## ప్రియమైన 'ఆంధ్రజ్యోతి'కి...

### ◆ లక్ష్మీపూజ @ ఏటీఎం

**అ**ర్ధ శతాబ్దం వెనక్కి వెళ్తే అప్పుడు జనాలు తక్కువ, బ్యాంకులూ తక్కువ, బ్యాంకులో డబ్బులేసేవారూ తక్కువే కావడంతో బ్యాంకుకి వెళ్తే గంటలో డబ్బులు వేయడమో, తీయడమో జరిగేది. ఇంత టెక్నాలజీ అప్పుడు లేకపోయినా! మరి ఇప్పుడో పెరిగిన జనాభా అవసరాలకు తగ్గట్టుగా బ్యాంకులు అనేక బ్రాంచీలుగా విస్తరించాయి. అవి చాలక ప్రతీ వంద అడుగులకో ఏటీఎం వెలిసింది. అయినా వెళ్లగానే డబ్బులిచ్చే 'లక్ష్మీ యంత్రం' కోసం వీధివీధీ వెతుకులాట తప్పట్లేదు. ఇ- వ్యాలెట్‌లు వచ్చాక కూడా జనానికి నగదు మీద మమకారం పెరగడం విచిత్రమే.

**- కళ్యాణకృష్ణ,** కొత్తూరు

### ◆ నాట్య మయూరం

**ఇ**డుపుల పాయలోని 'మయూరాల నిలయం' విశేషాలు చదివిన తర్వాత వెంటనే అక్కడికి వెళ్లి, వాటి అందాన్ని చూడాలనిపించింది. తెలుగు రాష్ట్రాల్లోని ఏకైక నెమళ్ల పునరుత్పత్తి కేంద్రానికి ప్రభుత్వం సరిగ్గా నిధులివ్వకపోవడం అన్యాయం, విచారకరం. ప్రేమగా పెంచుకోవాలనుకునేవారికి ఈ నెమళ్లను ఇస్తే భారం తగ్గుతుంది కదా!

**- మందగిరి శర్మ,** ఈమెయిల్

### ◆ విచక్షణే ముఖ్యం!

**ఈ** వారం కథ 'ఏల ప్రేమింతు నిన్ను?' నేటితరం అమ్మాయిల మనస్తత్వాన్ని అందంగా ప్రతిబింబించింది. 'ప్రేమ' అనే కమ్మని వలలో పడి, తమ మనోధైర్యాన్ని కోల్పోతున్న విధానాన్ని 'కీర్తి' పాత్రలోనూ, పెద్దలను ఎదిరించి, తన నిర్ణయం పైనే నిలబడగలిగే నిజమైన వ్యక్తిత్వాన్ని 'లక్ష్మత' పాత్ర ద్వారానూ చక్కగా వివరించారు.

**- ఎస్. మహేశ్వరి,** హైదరాబాద్

### ◆ 'అమి'తాశ్చర్యం

**క**వులను, కళాకారులను పట్టించుకోని ఈ కాలంలో 'స్టార్ స్టేటస్' సంపాదించుకున్న రచయిత 'అమిష్' చెప్పిన విషయాలు ఎంతో ఆకట్టుకున్నాయి. 'ఎవరెన్ని రకాలుగా చెప్పినా... ఉన్నది మాత్రం నాలుగు ఇతిహాస కథలే' అన్నాడో కవి. అమిష్ కూడా అదే నిరూపిస్తున్నాడు. నేటితరానికి పురాణాలను కొత్తగా పరిచయం చేయడం అభినందనీయం.

**- పి. చంద్రశేఖర్,** లక్ష్మాపూర్

### ◆ పిట్ట కొంచెం - కూత ఘనం

'ఎలాగోలా కష్టపడి అరవై శాతం మార్కులతో పాసైపోతే చాలు...' అని ఆలోచిస్తున్న విద్యార్థులే ఎక్కువ. అలాంటిది, 'టీనేజీలోనే వ్యాపారంలో బిజీ' అయిన బుడతల గురించి తెలుసుకుని ఆశ్చర్యపోయాం. ఈ చిన్నారుల కలలు నెరవేరాలనీ, నేటి తరానికి ఆదర్శంగా నిలిచేస్థాయికి చేరుకోవాలనీ కోరుకుంటున్నాం.

**- ఇర్ఫాన్. కె,** చిత్తూరు

# ఒత్తిడికి 'కలరింగ్'!

ప్రతి ఇద్దరిలో ఒకరు ఒత్తిడి బారిన పడుతున్నారు. ఆ ఇబ్బందిని తప్పించుకోడానికి కొంతమంది యోగా చేయమంటారు, మరికొందరు ధ్యానం చేయమంటారు, ఇంకొందరు ఇంపైన సంగీతం వినమంటారు. ఈ సలహాల జాబితాలో తాజాగా మరొకటి చేరింది... అదే కలరింగ్! అందులోనూ రకరకాల ఇతివృత్తాలు.




## ద బైసికిల్ కలరింగ్

పెద్దలకే కాదు పిల్లలకూ బాగా నచ్చే పుస్తకమిది. ఇందులో మొక్కుబడిగా ఏదో ఒక బొమ్మకి రంగులు వేయడమే కాదు... ఆ బొమ్మలలో అందమైన, ఆసక్తికరమైన కథ దాగుంటుంది. చదువులో ఒత్తిడికి గురవుతున్న టీనేజర్లకి ఈ కలరింగ్ బుక్ బాగా ఉపయోగపడుతుంది. 120 పేజీల పుస్తకంలో సైకిలే హీరో. ఎవరూ తోలకుండానే ఆ సైకిలు ప్రపంచాన్ని చుట్టి రావడం అసలు కథ. పెన్సిల్ ఆర్ట్‌తో నిండిపోయిన బుక్‌లోని బొమ్మలను షాన్ జియాంగ్ అనే చిత్రకారుడు వేశాడు.



## యానీమోర్ఫియా

ఒకే బొమ్మలో వందల బొమ్మలను ఇరికించి వేయడంలో దిట్ట చిత్రకారిణి కెర్బీ రోసానస్. ఆమె ఒక పులి బొమ్మలో మెడ వరకు పులిలానే వేసి... అక్కడ్నించి అనేక జంతువుల మేళవింపుగా పెన్సిల్ ఆర్ట్‌తో చిత్రాలు గీస్తారు. ఆ చిన్న చిన్న బొమ్మలు ఏమిటో కనిపెట్టి, ఓపిగ్గా వాటికి రంగులు వేస్తూపోవాలి. ఆ ఏకాగ్రత ఒత్తిడికి ఔషధం అవుతుంది.



## 'మండల' మహత్తు!

హిందూ, బౌద్ధమతాల్లో మండలం అనేది పవిత్ర ఆధ్యాత్మిక చిహ్నం. ఆ మండలంలోనే రకరకాల కోణాలు ఉంటాయి. వృత్తాలూ, త్రిభుజాలూ, చతురస్రాలూ... అనేకం. వాటికి రంగులేస్తుంటే... ప్రశాంతంగా ఉంటుందనీ, ధ్యానంలాంటి మనోస్థితిని పొందవచ్చనీ సాధకులు చెబుతారు.




## జంతుజాలం

మరో కలరింగ్ బుక్ 'క్రీచర్స్- గ్రేట్స్ అండ్ స్మాల్'. ఇందులో ప్రపంచంలోని అన్ని జీవుల రేఖాచిత్రాలూ ఉంటాయి. అతి చిన్నపక్షి, అతి పెద్ద పక్షి, మహా జలచరం... ఇలా ఆసక్తికరమైన సమాచారంతో ఈ పుస్తకాన్ని అచ్చేశారు. మొత్తం 35 పేజీలలో సీతాకోకచిలుక నుంచి ఎలుగుబంట్ల వరకూ అనేక జీవజాతులు పరిచయం అవుతాయి. అమెరికాకు చెందిన లూసీ ఎంగిల్మన్ ఈ ఇలస్ట్రేషన్స్ వేశారు.




## బొమ్మల భారతం

'జయ కలరింగ్ బుక్'లో మహాభారతంలోని కథల ఆధారంగా బొమ్మలను వేశారు దేవదత్ పట్నాయక్. వాటికి రంగులు వేస్తూనే మహాభారత కథను కూడా తెలుసుకోవచ్చు. ఇందులో వ్యాసుడు వినాయకునికి కథ చెబుతున్న దగ్గరి నుంచీ కురుక్షేత్ర యుద్ధం ముగిసే వరకూ... బొమ్మలతోనే కథను చెప్పేశారు. ఈ పుస్తకంలో మొత్తం 108 బొమ్మలు ఉన్నాయి. అలాగే రామాయణంలోని సీతాదేవి కథను కూడా 'సీతా కలరింగ్ బుక్'లో చూపించారు.




## యాప్స్ కూడా...

ఎంచక్కా ఆండ్రాయిడ్ ఫోన్లలో కూడా బొమ్మలకు కలరింగ్ చేసుకోవచ్చు. ఆ యాప్స్ డౌన్‌లోడ్ చేసుకుంటే చాలు. అందులో ముఖ్యమైంది కలర్‌ఫై యాప్. ఇందులో ఐదొందల బొమ్మలు ఉంటాయి. దీనిని డౌన్‌లోడ్ చేసుకుంటే ఇంటర్నెట్ లేకపోయినా... ఆఫ్ లైన్లో రంగులు వేయవచ్చు. ఏ క్యాబ్‌లోనో, బస్సులోనో వెళ్తున్నప్పుడు బోలెడంత కాలక్షేపం, దాంతోపాటే ఒత్తిడి నుంచి విముక్తి.



## పిల్లులే పిల్లులు!

ఒకటి కాదు, రెండు కాదు డెబ్బై పిల్లులు... ఒత్తిడిని దూరం చేసేందుకు సిద్ధంగా ఉంటాయి 'క్యాట్స్' కలరింగ్ పుస్తకంలో. రకరకాల పోజుల్లో భలే నవ్వు తెప్పిస్తాయి బుల్లి మార్జాలాలు. వాటికి రంగులు వేస్తుంటే ఒత్తిడి, చికాకు ఇట్టే మాయం అయిపోతాయి. పిల్లులతో పాటూ పూలు, ఆకులకు కూడా రంగులు వేయచ్చు. ఇందులో ఉన్న కాగితాలను సింగిల్ షీట్లుగా విడదీసుకోవచ్చు కూడా.



దైవమ్

# మహాగురువు...
# వ్యాసుడు!

**భారతీయ సనాతన సంప్రదాయంలో గురువుకు అత్యంత పవిత్రమూ, ఉన్నతమూ అయిన స్థానం ఉంది. గురువును బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల సమ్మిళిత స్వరూపంగా ఆరాధించటం మన ఆనవాయితీ. ఆచార్యదేవో భవ అని కీర్తించే సంస్కృతి మనది. ఈ సంస్కృతికి ప్రతీకగా ఆషాఢ శుద్ధ పూర్ణిమను గురుపూర్ణిమగా జరుపుకొంటాం.**

గురుపూర్ణిమను వ్యాసపూర్ణిమ అని కూడా అంటారు. కారణం గురువులందరికీ పరమ గురువు వ్యాస భగవానుడేనని భావించటమే. నాలుగు వేదాలను విభజించిన కారణంగా ఆయనను వేదవ్యాసుడు అన్నారు. ఇదే రోజున ఆదిశంకరాచార్యుల పూజ కూడా జరుగుతుంది. వాస్తవానికి శంకర జయంతి వేరే ఉన్నా వ్యాసపూర్ణిమనాడే ఆదిశంకర పూజ కూడా జరగటానికి కారణం వ్యాసభగవానుడే ఆదిశంకరుడిగా జన్మించారని అనుకోవటమే. ఈ పరంపరలోనే... సాధారణ ప్రజానీకం మొదలు సన్యాసాశ్రమం స్వీకరించిన వారి దాకా అందరూ వారి వారి గురువులను ఆ రోజున పూజిస్తూ ఉంటారు.

**గురు రూపం**

వ్యాసుడు ప్రతి గురువూ తన రూపమేనని చాటిచెప్పిన కథ బ్రహ్మాండ పురాణంలో కనిపిస్తుంది. ఆ కారణం చేతనే వ్యాసపూర్ణిమ గురుపూర్ణిమ అయింది.

పూర్వం వేదనిధి అనే ఓ పండితుడు ఉండేవాడు. అతడి భార్య వేదవతి. ఆ దంపతులకు ఎంతకాలానికీ సంతానం కలగలేదు. వేదవ్యాసుడు గంగానదికి స్నానానికి వస్తాడనీ, ఆయనను ఎలాగైనా ఇంటికి పిలిచి అతిథిపూజాసత్కారాలు చేస్తే ఫలితం దక్కుతుందనీ కొందరు పెద్దల వల్ల తెలుసుకున్నాడు వేదనిధి. వ్యాసుడొచ్చే సమయానికి గంగ ఒడ్డుకు చేరి నమస్కరించాడు. ఆ మరునాడే వేదనిధి తండ్రి పితృకార్యం ఉన్నందువల్ల, ఆ సమయానికి భోజనానికి తన ఇంటికి రమ్మనమని భక్తి వినయాలతో ఆహ్వానించాడు వేదనిధి. వ్యాసుడు సరేనన్నాడు. ఇచ్చిన మాట ప్రకారం మరునాడు ఆ పండితుని ఇంటికి వెళ్లి భోజనమయ్యాక దంపతులను ఆశీర్వదించాడు. ఉత్తములు, భాగ్యవంతులు అయిన పదిమంది కుమారులు కలుగుతారన్నది ఆ ఆశీర్వచన సారం. అందుకు వేదనిధి మహ ఆనందపడిపోతూ మళ్లీ వ్యాసమహర్షి దర్శనం ఎలా ఎప్పుడు జరుగుతుందో చెప్పమన్నాడు. అందుకు వ్యాసుడు చిరునవ్వు నవ్వుతూ సమాజానికి సన్మార్గం చూపే పౌరాణికులు, ఉత్తమ గురువులలో తానెప్పుడూ ఉంటాననీ వారిని దర్శించి పూజిస్తే తనకు పూజ చేసినట్లేనని చెప్పి అంతర్ధానమయ్యాడు.

**కారణజన్ముడు**

వ్యాసభగవానుడు మానవాళికి అందించిన గ్రంథమే మహాభారతం. ఈనాడు కనిపిస్తున్న ఎన్నెన్నో వైజ్ఞానిక అంశాలను గురుదేవుడు ఆనాడే భారతంలో చెప్పాడు. టెస్ట్ ట్యూబ్ బేబీ విధానం, లింగమార్పిడి, ఆకాశహర్మ్యాల నిర్మాణ వ్యవస్థ, భూగర్భ ప్రయాణాలు... ఇలా చెప్పుకుంటూ పోతే ఆశ్చర్యాన్ని కలిగించే అంశాలు అష్టాదశ పురాణాలలోనూ, పంచమ వేదమని పేరుపొందిన మహాభారతంలోనూ కోకొల్లలు. వ్యాసుడు కారణజన్ముడు. తల్లిదండ్రులను గౌరవించే సంస్కృతికి ఆయనొక తీపి గుర్తు. పుట్టీపుట్టగానే తల్లి ఆశీస్సులందుకొని తపస్సుకు వెళుతూ... ఆ తల్లి ఎప్పుడు కోరితే అప్పుడు ప్రత్యక్షమవుతానని మాట ఇచ్చిన మహనీయుడు. అలాగే మహాభారతంలో కూడా ఎప్పుడు, ఎక్కడ ధర్మరక్షణ అవసరమో అక్కడ తాను ప్రత్యక్షమై ఆ సంఘటనతో సంబంధం ఉన్నవారికి సన్మార్గం చూపిన మహాగురువు. అవసరమైనప్పుడల్లా తన మహిమలను ప్రదర్శించి అందరికీ ఆనందాన్ని కలిగించాడు. దీనికి ఓ గొప్ప ఉదాహరణ మహాభారతంలోని ఆశ్రమవాసిక పర్వంలో కనిపిస్తుంది.

కురుక్షేత్ర సంగ్రామంలో అసంఖ్యాక జనం మరణించారు. చివరకు కౌరవులలో గాంధారీ ధృతరాష్ట్రులు తమ బిడ్డలను, బంధువర్గాన్ని కోల్పోయి కుమిలి కుమిలి ఏడుస్తున్న సమయంలో వ్యాసుడు ఆమెను ఓదారుస్తూ మరణించిన వారంతా కారణజన్ములేననీ, అలా జరగటం ధర్మాన్ని నిలబెట్టడానికి చేసిన ప్రయత్నమేననీ వివరించాడు. అంతేకాక గాంధారీ ధృతరాష్ట్రులను మరింతగా ఓదారుస్తూ ఆ రోజు సాయంకాలానికి గంగాతీరానికొచ్చి స్నానం చేసి కూర్చుంటే యుద్ధంలో మరణించిన వారందరినీ నిద్ర నుంచి లేచొచ్చిన వారిలాగా, మరణించేటప్పుడు ఏ రూపాలతో ఎలా ఉన్నారో అలా చూడవచ్చని చెప్పాడు. ధృతరాష్ట్రుడు తన సేనా పరివారంతో గంగా తీరానికి వెళ్లాడు. కాస్త పొద్దువాలగానే వ్యాసుడు తాను కూడా గంగలో స్నానం చేసి బయటికొచ్చాడు. ఆ తర్వాత గంగానదిలో పెద్దపెట్టున శబ్దాలు వినిపించాయి. మరుక్షణంలో కురుక్షేత్ర సంగ్రామంలో మరణించిన వారంతా చిరునవ్వులు నవ్వుతూ అక్కడికొచ్చి వారి వారి స్త్రీలతో, బంధుమిత్రులతో హాయిగా కాలం గడిపారు. ధృతరాష్ట్రుడికి వ్యాసుడు దివ్యదృష్టిని ప్రసాదించడంతో గాంధారీ ధృతరాష్ట్రులు తమ బిడ్డలనూ బంధువులనూ ఆనందంగా చూసుకోగలిగారు. తెల్లవారుతుండగా మళ్లీ అంతా మాయమయ్యారు. ఇది వ్యాసుడు భగవానుడు అని చెప్పటానికి కేవలం ఓ ఉదాహరణ మాత్రమే. ఇలాంటివి ఎన్నెన్నో భారతంలో కనిపిస్తాయి.

వ్యాసుడు అనేది ఒక వ్యక్తి పేరు కాదు. అదొక పదవి. ప్రతి మహాయుగంలోనూ విష్ణువు వ్యాసుడిగా అవతరిస్తుంటాడు. ప్రస్తుతం వైవస్వత మన్వంతరంలో ఇప్పటికి ఇరవై ఏడు మహాయుగాలు పూర్తయి... ఇరవై ఎనిమిదవ మహాయుగంలో కలియుగం నడుస్తోంది. ప్రతి మహాయుగంలో వచ్చే ద్వాపర యుగంలో ఒక్కొక్క వ్యాసుడు అవతరిస్తుంటాడు. ఆ పరంపరలో మొదటివాడు స్వాయంభువుడు. ఇరవై ఎనిమిదవవాడు కృష్ణద్వైపాయనుడు. ప్రస్తుత వ్యాసుడి తండ్రి పరాశరుడు. వ్యాసుడు భగవానుడిగా, గురువుగా భారతీయుల మనోమందిరాలలో అలా చిరకాలం పూజలందుకొంటూనే ఉంటాడు.

● శ్రీమల్లి,
73829 27069





# ఊరికే ఎత్తుకోవడం తప్పా?




**మేడమ్ నమస్తే... నాకు యేడాది వయసున్న బాబు ఉన్నాడు. చిన్నప్పటి నుంచి అతి ప్రేమతో వాడు ఏడుపు మొదలెట్టగానే మేమిద్దరం వెంటనే ఎత్తుకోవడం మొదలెట్టాం. అదే విపరీతమైన గారాబంగా మారింది. ఎత్తుకుంటేగానీ ఏడుపు ఆపడు. మేమే వాడిని అనవసరంగా చెడగొడుతున్నామంటారా?**

**- వి. జ్యోతి, మంచిర్యాల**

సాధారణంగా పిల్లల్ని ఎత్తుకోవడం అనేది తప్పేం కాదు. అయితే బాబు ఎందుకు ఏడుస్తున్నాడనేది తెలుసుకోవాలి. ఒక యేడాది బాబు అంటున్నారు కాబట్టి, నడవడం కూడా వచ్చి ఉండాలి. పిల్లలు అలా నడుస్తూ అంతా తిరగాడుతుంటారు. అలాంటప్పుడు వారిని ఆపాలని చూస్తే ఏడుస్తారు. పిల్లలు పడిపోతారేమోననే భయంతో పట్టుకోవాలని చూస్తే సహజంగానే అది వారికి నచ్చదు. అలాంటి పరిస్థితుల్లో జాగ్రత్త కోసం తల్లిదండ్రులు, పిల్లల్ని కదలకుండా ఉండేందుకు ఎత్తుకోవడం అలవాటు చేస్తుంటారు. అలా కాకుండా తనను పట్టించుకోవడం లేదని అటెన్షన్ కోసమే ఏడుస్తుంటే, భయపడిపోయి మీరు ఎత్తుకుంటే క్రమంగా అలవాటుగా మారుతుంది. అది పిల్లాడికి, మీకు ఏ మాత్రం మంచిది కాదు. అంతేగానీ పిల్లల్ని ఆప్యాయంగా ఎత్తుకుని దగ్గరకు తీసుకోవడం మంచి పద్ధతే.

**పిల్లల పెంపకంలో భార్యాభర్తలకు సమాన బాధ్యత ఉంటుందంటారు కదా. నాకు ఆరేళ్ల బాబున్నాడు. వాడి గురించి మా ఆయన అస్సలు పట్టించుకోరు. బాబుకు సంబంధించి ప్రతీ పని నేనే చేసుకోవాలి. నేనేదైనా పనిలో బిజీగా ఉన్నప్పుడు, ఖాళీగా ఉన్నా సరే బాబు ఆలనాపాలనా చూడరు. బాబు పెంపకంలో ఆయన్ని కూడా ఇన్వాల్వ్ చేయాలంటే ఏం చేయాలి?**

**- వనజ, రాజమండ్రి**

పిల్లల పెంపకం గురించి మీవారికి పెద్దగా అవగాహన లేనట్టుగా ఉంది. పిల్లల పెంపకంలో తల్లిదండ్రులిద్దరికీ సమానమైన బాధ్యత ఉంటుంది. పిల్లల్ని ఎలా చూడాలి? ఎంత జాగ్రత్తగా ఉండాలి? అనేది అర్థమయ్యేలా చెప్పాలి. పిల్లలకు బట్టలు మార్చడం, ఒళ్లు తుడవడం, డైపర్లు మార్చడం వంటి పనుల్లో నెమ్మదిగా ఆయన్ని కూడా ఇన్వాల్వ్ చేయండి. ఆ పనులు ఎలా చేస్తారో చేసి చూపండి. రెండోసారి ఆ పనిని ఆయనకే అప్పగించి, బాగా చేశారని మెచ్చుకోండి. పిల్లల్ని భుజాలపై ఎక్కించుకుని అన్నం తినిపించడం, పిల్లల్ని నిద్రపుచ్చడం వంటివి నెమ్మదిగా నేర్పించడం ద్వారా అందులోని ఆనందం ఆస్వాదించేలా చేయాలి. ఆరేళ్ల వయసులో పిల్లలు ముఖాల్ని గుర్తుపట్టి, చిరునవ్వులు చిందిస్తారు కాబట్టి ఆ అనుభవాలు ఎంత ఆనందాన్నిస్తాయో వివరించండి. పిల్లల పెరుగుదలలో తండ్రి పాత్ర కూడా కీలకమే అనే విషయం మర్చిపోకండి.

**నా కూతురు ఒక కార్పొరేట్ స్కూల్లో ఆరవ తరగతి చదువుతోంది. ఈమధ్య వాళ్ల క్లాస్‌టీచర్ అమ్మాయికి 'బిహేవియర్ ప్రాబ్లమ్' ఉందని చెప్పింది. 'బిహేవియర్ ప్రాబ్లమ్' అంటే ఏమిటి? ఆ విషయంలో తల్లిదండ్రుల బాధ్యత ఎంత?**

**- ఎన్. కళ్యాణి, విశాఖపట్టణం**

పాప గురించి టీచర్ చెప్పారు కాబట్టి మొదట ఆమెతో కూర్చుని సమస్య ఏమిటో తెలుసుకోండి. ఏయే సందర్భాల్లో పాప బిహేవియర్ బాగుండట్లేదో చెబితే దానికి తగ్గట్టుగా మీరు జాగ్రత్తలు తీసుకోవచ్చు. అంటే పాప టీచర్‌తో బాగుండట్లేదా? ఫ్రెండ్స్‌తో గొడవపడుతోందా? క్లాసురూమ్‌లో ఏమైనా అసహజంగా ప్రవర్తిస్తోందా? వంటి విషయాలు తెలిస్తేగానీ పరిష్కారం కనుక్కోవడం కష్టం. 'బిహేవియర్ ప్రాబ్లమ్' అనేది చాలా పెద్ద సబ్జెక్టు. దీనికి ఎవరో ఒకరిని బాధ్యులుగా చేయలేం. ఉదాహరణకు పాప చాలా దూకుడుగా ఉంటూ తోటి పిల్లలను కొడుతుంటే... అలా కొట్టడాన్ని ఇంటి దగ్గర తల్లిదండ్రుల నుంచి నేర్చుకుందా, మరెక్కడైనా చూసిందా అనేది ఆలోచిస్తాం. అంతేగానీ పాప చేస్తున్న తప్పుగా చూడలేం. మూలాలు కనుక్కుంటే ఆ సమస్య నుంచి పాపను బయటకు తీసుకురావడం సులువే. కాబట్టి, 'బిహేవియర్ ప్రాబ్లమ్' ఎక్కడుందో ప్రత్యేకించి తెలిస్తే, మరింత వివరంగా సమాధానం ఇచ్చేందుకు వీలవుతుంది.



**సుజాతా రాజమణి**
కన్సల్టెంట్ సైకోథెరపిస్ట్,
కిమ్స్ హాస్పిటల్

మీ పిల్లల ప్రవర్తనకు సంబంధించి ఏమైనా ప్రశ్నలుంటే మాకు పోస్ట్‌లో గానీ, మెయిల్‌లో గాని పంపవచ్చు.

**అడ్రస్ :** ఆదివారం ఆంధ్రజ్యోతి, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33, **మెయిల్ ఐడి :** sunday.aj@gmail.com

# మనుషులే... పుస్తకాలైతే!





**ఆ లైబ్రరీల్లో మనుషులే గ్రంథాలు, మాటలే అక్షరాలు, అనుభవాలే అధ్యాయాలు! 'హ్యూమన్ లైబ్రరీ' ఉద్యమం ప్రపంచమంతా విస్తరిస్తోంది. 'మనిషితో మాట్లాడ్డమే ఓ ఎడ్యుకేషన్'... అన్నసూత్రం మీద ఇవి పనిచేస్తాయి. ఆ ఆవరణలో 'సైలెన్స్ ప్లీజ్' బోర్డు ఉండదు. 'దయచేసి మాట్లాడండి...' అన్న సూచనే కనిపిస్తుంది.**

## కవర్ స్టోరీ

అదిగో పుస్తకం!

అవును, పుస్తకమే!!

మన వైపే నడుస్తోంది. మన దగ్గరికే వస్తోంది.

అప్పుడే, ముద్రించిన ముఖచిత్రంలా... మొహంలో ఇదీ అని చెప్పలేని కొత్త కాంతి. అది అనుభవాల తాలూకు వెలుగు కావచ్చు.

ఆ నిమిషమే విచ్చుకున్న కాగితంలా... చుట్టూ కొత్త పరిమళం. అది ఒంటికి అద్దుకున్న జవ్వాది సువాసన కావచ్చు.

పేజీలు తెరుచుకున్నట్టే, నోరూ తెరుచుకుంది. ముందుమాటలా... ఊరు, పేరు, బాల్యం, విద్యాభ్యాసం. విషయసూచికలా... సంక్షిప్త పరిచయం.

ఒక్కో అనుభవం ఒక్కో పేజీ. ఒక్కో మలుపూ ఒక్కో అధ్యాయం. కాగితాలు తిరగేస్తున్న సవ్వడిలా... ఉచ్ఛ్వాసనిశ్వాసాలు.

చదవడం పూర్తయిపోగానే, చివరి అట్టను ఆత్మీయంగా తడిమి... గ్రంథాన్ని గమ్యానికి చేరుస్తాం. అది - డ్రాయింగ్‌రూమ్‌లోని బుక్ షెల్ఫ్ కావచ్చు, పక్కవీధిలోని లైబ్రరీ కావచ్చు. దాన, విక్రయాది సర్వహక్కులూ కలిగిన సొంతదారు చిరునామా కావచ్చు.

వచ్చిన పని అయిపోగానే, అప్పగించిన బాధ్యత తీరిపోగానే... జీవితానుభవ సారాన్ని దోసిళ్లకొద్దీ పోసి, తాను మాత్రం కాసిన్ని కాఫీ నీళ్లు తాగి, తాపీగా బయల్దేరుతుందా పుస్తకం!

- అది నడిచే పుస్తకం. మాట్లాడే పుస్తకం. నవ్వే పుస్తకం. ఏడ్చే పుస్తకం. ప్రాణమున్న పుస్తకం... 'మానవ పుస్తకం'!

### డెన్మార్క్‌లో ...

ప్రతి మనిషీ ఓ రచయితే. తనకూ ఆలోచనలుంటాయి. తనలోనూ అంతర్మథనం జరుగుతుంది. తన ఊహల్లోనూ ఏవేవో పాత్రలు పచార్లుచేస్తుంటాయి. వాటికి అక్షర రూపం ఇచ్చినవాడు కవో, రచయితో అనిపించుకుంటాడు. ఇవ్వనివాడు మాత్రం సామాన్యుడిలా మిగిలిపోతాడు. రాయకపోవచ్చు. రాయడం రాకపోనూవచ్చు. అంతమాత్రాన, ఆ అనుభవాలు వృథా కావాల్సిందేనా, ఆ ఆలోచనలు మురిగిపోవాల్సిందేనా? లేదు లేదు, మస్తకంలోని ఆ అదృశ్య పుస్తకాన్ని, ఆ అముద్రిత సాహిత్యాన్ని... గుర్తించగలిగితే, గుర్తించి ప్రోత్సహించగలిగితే - విన్నవాళ్లకు విన్నంత విజ్ఞానం! అప్పుడిక, సమాజమే గ్రంథాలయం అవుతుంది. ఆ ఆలోచనతో ప్రాణంపోసుకున్నదే 'హ్యూమన్ లైబ్రరీ' - ఉద్యమం! పదహారేళ్ల క్రితం... డెన్మార్క్‌లో మొదలైన కార్యక్రమం ఈమధ్యే భారతదేశానికి వచ్చింది. దిల్లీ, హైదరాబాద్, ఇండోర్, ముంబయి తదితర చోట్ల శాఖలు ఏర్పాటయ్యాయి. ఎక్కడైనా, నిర్వహణ ఒకేలా ఉంటుంది.

లైబ్రరీలో ఉన్నట్టే...

ఇక్కడా, పాఠకులుంటారు.

కానీ, చదవరు, సంభాషిస్తారు.

లైబ్రరీలో ఉన్నట్టే...

ఇక్కడా పుస్తకాలుంటాయి,

కానీ, మానవ పుస్తకాలుంటాయి.

అంటే...

ఇక్కడ మనుషులే పుస్తకాలు, సంభాషణలే పుస్తక పఠనం. తమ అనుభవాలూ జ్ఞాపకాలూ నలుగురికీ ఓ పాఠంలా పనికొస్తాయన్న నమ్మకం కలిగితే చాలు. ఎవరైనా అక్కడికెళ్లి పేరు నమోదు చేసుకోవచ్చు. మరుక్షణం నుంచీ మానవ లైబ్రరీ రికార్డుల ప్రకారం తనో అచ్చమైన పుస్తకం. లైంగిక వివక్ష, ట్రాన్స్‌జెండర్స్, గృహహింస, క్యాన్సర్ మీద పోరాటం, మాదక ద్రవ్యాల బానిసత్వం... ఇలా, ఏ అంశం మీద అయినా పుస్తకంగా మారిపోవచ్చు. అయితే ఆ ఇతివృత్తంతో బతుకు ముడిపడి ఉండాలి. ఆ కథనం జీవితంలో ఓ

భాగమై ఉండాలి. ఆ వివరాల్ని బట్టే ఓ 'టైటిల్' ఇస్తారు. అదే 'నేమ్ ఆఫ్ ది బుక్'గా రికార్డులకెక్కుతుంది.

లైబ్రరీకి కొత్త పుస్తకం వచ్చినట్టు ఆన్‌లైన్‌లో, ఆఫ్‌లైన్‌లో సభ్యులకు సమాచారం వెళ్లిపోతుంది. 'ఆ పుస్తకాన్ని మేం చదవాలనుకుంటున్నాం...' అన్న విజ్ఞప్తి అందడమే ఆలస్యం లైబ్రేరియన్ ఓ తేదీని ఖరారు చేస్తారు. నిర్ణీత సమయానికంతా... ఆ పుస్తకుడో, పుస్తకురాలో అక్కడికి చేరుకుంటారు. పుస్తకాభిమానులూ సిద్ధంగా ఉంటారు. రద్దీ ఎక్కువగా ఉంటే, ముందు వచ్చినవారికే ముందు అవకాశం. కాసేపటికే పఠనం మొదలవుతుంది. ఆ నలుగురైదుగురి మధ్యా 'హ్యూమన్ బుక్' జీవితం... తెరిచిన పుస్తకం అవుతుంది.

### ష్... నిశ్శబ్దం!

ఒక పుస్తకం ఉన్నట్టు మరో పుస్తకం ఉండదు. ఒక మనిషిలా మరో మనిషి ఆలోచించడు, స్పందించడు. ఆ విలక్షణతే అతడికో ప్రత్యేకతను తెచ్చిపెడుతుంది. చెట్టు మీంచి యాపిల్ కిందపడినప్పుడు న్యూటన్ మాత్రమే న్యూటన్‌లా ఆలోచించాడు. వేయి ప్రయోగాలు విఫలమైనప్పుడు ఎడిసన్ మాత్రమే ఎడిసన్‌లా స్పందించాడు. ఆ వైవిధ్యమే మనిషి అనుభవాలకు పుస్తక ప్రతిపత్తిని ప్రసాదించింది.

ఫలానా పుస్తకమో, ఫలానా పుస్తకంలోని పాత్రో నా జీవితాన్ని సమూలంగా మార్చేసిందని ప్రకటించిన మహావ్యక్తులు అనేకమంది. ప్రాణంలేని పుస్తకమే మనిషిని మార్చగలిగినప్పుడు, ప్రాణమున్న పుస్తకానికి ఇంకెత శక్తి ఉండాలి? 'హ్యూమన్ లైబ్రరీ' సృష్టికర్త రోనీ అబర్జెల్‌ను కూడా మానవ పుస్తకాలే ప్రభావితం చేశాయి. పదహారేళ్లు నిండేదాకా, తను అల్లరి తిరుగుళ్లు తిరిగాడు. లక్ష్యం లేకుండా బతికాడు. కాలేజీలో ఓ మాస్టారు చొరవ తీసుకుని, స్టూడెంట్ ఎక్స్ఛేంజ్ ప్రోగ్రామ్ కింద విదేశాలకు పంపాడు. ఆ సరికొత్త వాతావరణంలో, సరికొత్త మనుషుల మధ్య, సరికొత్త సంభాషణలతో... మాయాపొర తొలగిపోయింది. అహంకారపు కుబుసం తొలగించుకుని అసలు మనిషి బయటికొచ్చాడు.

సంభాషణ...

ప్రశ్న...

జీవితంలో ఈ రెండూ కనుక పుష్కలంగా ఉంటే, అంతకు మించిన చదువేలేదన్న నిర్ణయానికొచ్చాడు రోనీ. నలభై రెండేళ్ల వయసులో మానవ లైబ్రరీ ఉద్యమాన్ని మొదలుపెట్టాడు. చాలాసార్లు మనం సూపర్‌మార్కెట్ దగ్గరో, బస్టాప్‌లోనో ఎవరో అపరిచితుడ్ని చూస్తాం. చూసీ చూడగానే... అహంభావి అనో, ముక్కోపి అనో, గుంటనక్క అనో, బుద్ధావతారమనో.. ఓ నిర్ణయానికి వస్తాం. అందులో తొంభైతొమ్మిది శాతం తప్పుడు అంచనాలే. ఓ పలకరింపు తర్వాతే, సుదీర్ఘ సంభాషణ జరిగాకే, ప్రశ్నోత్తరాలపర్వం ముగిశాకే... ఎవర్నయినా కొంతమేర బేరీజు వేయవచ్చు. నిజానికి ఆ అంచనాలకూ అర్థంలేదు. ప్రతి పుస్తకమూ గొప్పది కాకపోవచ్చు. కానీ, ఏ పుస్తకమూ చెత్తది కాదు. పనికొచ్చే అధ్యాయమో, పేరానో, వాక్యమో, పదమో... ఏదో ఒకటి ఉండితీరుతుంది. మనుషుల్లోనూ అంతే. ముఖే ముఖే సరస్వతి అన్నట్టు... ప్రతి ఒక్కరూ పనికొచ్చే పాఠాలే. హ్యూమన్ లైబ్రరీకెళ్లి ఓ మానవ పుస్తకాన్ని చదివాక కానీ, ఆ తత్వం బోధపడదు. ఆ కేటలాగూ తెరిస్తే... ఎన్ని పుస్తకాలూ, ఆ పుస్తకాల మాటున ఎన్నెన్ని జీవితాలూ!




**పుస్తకం పేరు...**

'ఎన్నాళ్లీ సంకెళ్లు'

సుప్రజ ఇంజినీరింగ్ చదువుకుంది. పెళ్లికిముందు కొంతకాలం ఉద్యోగం చేసింది. మా కోడలు కొలువు చేయడానికి వీల్లేదు' అంటూ పెళ్లిచూపుల్లోనే అబ్బాయి తల్లి షరతు విధించడంతో 'అబ్బో! అత్తగారికి కోడలంటే ఎంత ప్రేమో!' అని మురిసిపోయారు సుప్రజ అమ్మానాన్నలు. ఇదంతా కంటికి రెప్పలా చూసుకోడానికి కాదు, కొరివిదెయ్యంలా కాల్చుకు తినడానికే - అన్న విషయం తెలియడానికి ఆర్నెల్లు పట్టింది. అప్పటికే మూడుముళ్లు పడ్డాయి. మూడునెలల పిండాన్ని కడుపున మోస్తోంది. అత్త గయ్యాళి. మామ వెన్నెముక లేని మనిషి. మొగుడు వ్యక్తిత్వంలేని వెధవ. మరిది మరీ నీచుడు. పుట్టింటి వాళ్ల సహకారం అంతంతే అయినా, సమాజం చిన్నచూపు చూస్తున్నా, మాజీ భర్త ఫేస్‌బుక్ పోస్టింగులతో మానసిక హింసకు గురిచేస్తున్నా సుప్రజ చెదరలేదూ బెదరలేదూ. ఒంటరిగా నిలబడింది. ధైర్యంగా పోరాడింది.

ఆ నలుగురైదుగురు పాఠకుల మధ్య ఆమె మనసు పుస్తకంలా తెరుచుకుంది. అందరి

కళ్లలో తేమ, ఒకరైతే చేతిగుడ్డ అడ్డం పెట్టుకుని ఏడ్చేశారు కూడా.

'భర్తతో విడిపోతున్నప్పుడు బాధనిపించలేదా?'

'లేదు. పులి బోన్లోంచి బయటపడినంత రిలీఫ్'

'ఒంటరి తల్లిగా పిల్లల్ని ఎలా పెంచగలరు, మళ్లీ పెళ్లి చేసుకుంటారా?'

'ఆ మృగాల మధ్య పెరిగితే నా బిడ్డ కూడా జంతువులా తయారవుతుంది. ఆ విషయంలో నేను అదృష్టవంతురాల్ని. మళ్లీ పెళ్లి అంటారా? చూద్దాం. ఇప్పటిదాకా ఆ ఆలోచనే లేదు'

- చాలామంది రచయితలు ఆ కథ వెనుక కథను అనుబంధ అధ్యాయంలో వివరిస్తుంటారు. ప్రశ్నోత్తరాల కార్యక్రమ లక్ష్యమూ అలాంటిదే.

**పుస్తకం పేరు...**

'ఒంటరి పోరాటం'

బ్రిటిష్ కాలం నాటి పెద్దపెద్ద బంగళాలు. చేతినిండా పనివాళ్లు. ఎదురుపడితే చాలు బిర్రబిగుసుకు పోయి శాల్యూట్‌చేసే సిబ్బంది. బ్యాంకుఖాతాలో బోల్డంత డబ్బు. 'ఆహా! ఎంత అదృష్టం, ఎంత అదృష్టం!! జీవితమంటే ఇదీ, బతికితే ఇలానే బతకాలి! - అనిపిస్తోంది కదూ! కానీ, ఆ తళుకు బెళుకుల మధ్య నన్ను నేను కోల్పోయాను' అంటూ ఓ సైనిక అధికారి భార్య అదృశ్య పంజరాన్ని చూపించింది

- వ్యవస్థలోని రెండో కోణాన్ని ఆవిష్కరించే కాగితం పుస్తకాలు అతి తక్కువ. చట్టపరమైన సమస్యలకు భయపడో, సామాజికమైన ఒత్తిళ్లకు తలవంచో చాలామంది రచయితలు అలాంటి సాహసం చేయరు. మానవ లైబ్రరీలలో మాత్రమే ఆ కంచెలుండవు. నిర్భయంగా నగ్నసత్యాల్ని చర్చించుకోవచ్చు.

**పుస్తకం పేరు...**

'బాల్యం చుట్టూ బూచాళ్లు'

ఆమె పసిపిల్లల హక్కుల కోసం పోరాడుతున్న ఉద్యమకారిణి. లైంగిక దాడులకు బలి అవుతున్న వేలమంది బాలలతో మాట్లాడారు. కొందర్ని ఆ ఊబిలోంచి తప్పించారు. చట్టాల్ని కఠినతరం చేయాలంటూ న్యాయస్థానాల్లో కేసులు కూడా వేశారు. 'పురాణాల్లో రాక్షసులకు కోరలుంటాయి. భయంకరంగా కనిపిస్తూ ఉంటారు. దీంతో వాళ్ల అసురులని అర్థమైపోతుంది. సమాజంలో అలా కాదే. మనలానే ఉంటారు, మనలోనే ఉంటారు. మనకంటే ప్రేమగా మాట్లాడతారు. మితిమీరిన అనురాగాన్ని ప్రదర్శిస్తారు. ఆ పాత్రపేరు... తాతయ్య, మావయ్య, బాబాయి ఏదైనా కావచ్చు. కొన్నిసార్లు తండ్రో, మారు తండ్రో అయినా కావచ్చు...' అంటూ ఆ యువతి గుండెలు పగిలే నిజాలు చెబుతున్నప్పుడు గుండుసూది కిందపడినా వినిపించేంత నిశ్శబ్దం.

'ఏదిమంచో ఏది చెడో తెలియని బాల్యం... చెడును కూడా మంచే అనుకునే ప్రమాదం ఉంది. ఆ తేడా మనం చెప్పాలి. ఏ స్పర్శలో కామం బుసలుకొడుతోందో, ఏ స్పర్శలో ప్రేమ పొంగిపొర్లుతోందో స్పష్టంగా గ్రహించేంత జ్ఞానాన్ని ప్రసాదించాలి. మా పిల్లలకు నేను అదే చెబుతున్నా...' అంటూ ఓ పాఠకురాలు చివర్లో స్వీయానుభవాన్ని చెప్పుకొచ్చారు. ఇలాంటి, తక్షణ స్పందనల్లో ఉద్వేగం పొంగిపొర్లుతుంది. కొన్నిసార్లు పాఠకుల స్పందనలకూ పుస్తకమంత విలువ ఉంటుంది.

**పుస్తకం పేరు...**

'మరణంతో కరచాలనం'

అతనో పర్వతారోహకుడు. ప్రపంచంలోని ఎత్తయిన శిఖరాలన్నీ అధిరోహించాడు. ఓసారి, మంచుకొండ మీద జెండా పాతే ప్రయత్నంలో ఊబిలో కూరుకుపోయాడు. బయటపడాలని ప్రయత్నించేకొద్దీ మరింత లోతుకు దిగబడ్డాడు. తిండిలేదు. నీళ్లు లేవు. ఎన్నిరోజులు గడిచిపోతున్నదీ లెక్క తెలిసేది కాదు. ఇక, మరణం ఖాయమనుకున్నాడు. మృత్యువు గురించి ఆలోచించడం మొదలు పెట్టాడు. మరణాన్ని ప్రేమించే ప్రయత్నం చేశాడు. ఎంత రాజీపడాలనుకున్నా కుదర్లేదు. జీవితాన్ని మించిన అద్భుతం లేనేలేదన్న నిర్ధారణకు వచ్చాడు. ఎలా అయినా సరే, బతికి తీరాలన్న తపన మొదలైంది. ప్రయత్నం ప్రారంభమైంది. చేతికి అందేంత దూరంలో ఓ ఎండుకొమ్మ కనిపించింది. తన ఒంటిమీదున్న ఎర్రరంగు కోటును ఆ కొమ్మకు తగిలించి... పైకెత్తి పట్టుకున్నాడు. గగనతలంలో గస్తీ తిరుగుతున్న రక్షణ సిబ్బంది... మనిషి ఆనవాళ్లు తెలియగానే కిందికి దిగొచ్చి కాపాడారు. ఆ సాహసికుడి అనుభవాల్లో ఫిక్షన్‌లోని ఉత్కంఠ, నాన్‌ఫిక్షన్‌లోని గాఢత!

మానవ పుస్తకాల్లోని ప్రత్యేకత ఏమిటంటే... కథనంలో రచయిత చొరబాటు ఉండదు. విశేషణాలతోనో, ఉపమానాలతోనో పాఠకుడికిని ఆకట్టుకునే విన్యాసాలుండవు. జరిగింది జరిగినట్టు, అనుభవించింది అనుభవించినట్టు చెబుతారు. పుస్తక హోదా కూడా ఎవరికీ అయాచితంగా రాదు. హ్యూమన్ లైబ్రరీ బృందం ఆ వ్యక్తితో సంభాషించాకే, వడపోత పర్వం విజయవంతంగా పూర్తయ్యాకే.... నమోదు చేసుకుంటారు. పుస్తక పఠనం పక్కదారి పడుతున్నట్టో, వ్యక్తిగత విమర్శలతో కలుషితం అవుతున్నట్టో తెలిస్తే

**మామూలు పుస్తకంతో సంభాషించలేం. కానీ మానవ పుస్తకంతో మాట్లాడతాం, సందేహాలుంటే తీర్చుకుంటాం. మానవ పుస్తకాల్లో విస్తృతి తక్కువే. ఒకే మనిషి, ఒకే జీవితం, ఒకే రకమైన అనుభవాలు. మానవ పుస్తకాలు కాగితం పుస్తకాలకు ప్రత్యామ్నాయం కానే కాదు. ఒక పుస్తకంలోని పరిమితిని మరో పుస్తకం భర్తీ చేస్తుందంతే.**

**పుస్తకం కిటికీ లాంటిది. మహా అయితే తొంగి చూడగలం. అదే మానవ పుస్తకం... మహా ద్వారం! నేరుగా లోపలికి వెళ్లిపోవచ్చు.**

**డోంట్ జడ్జ్ ఎ బుక్ బై ఇట్స్ కవర్... అట్టను చూసి పుస్తకాన్ని అంచనా వేయలేం. మొహాన్ని బట్టి మనిషినీ బేరీజు వేయలేం. పుస్తకాన్ని చదవాలి. మనిషితో సంభాషించాలి.**

**'ఐ యామ్ ఎ బుక్. హ్యాండిల్ విత్ కేర్' - హ్యూమన్ లైబ్రరీ నినాదం. మనుషుల్ని కూడా పుస్తకాలంత జాగ్రత్తగా చూసుకోవాలి. అనుబంధాల అట్ట వేసుకోవాలి. కాగితాలు నలగకుండా చదివినట్టు, మనసులు గాయపడకుండా వ్యవహరించాలి. అర్థంకాని వాక్యాల్ని అర్థం చేసుకోడానికి ఇంకోసారి చదువుతాం. అర్థంకాని మనుషుల్ని అర్థం చేసుకోడానికి మరోసారి సంభాషిస్తాం.**

**పుస్తకాన్ని ప్రేమించే వాళ్లంతా మానవ పుస్తకాల్నీ ప్రేమిస్తారు. ఎందుకంటే, రెండుచోట్లా విజ్ఞానమే ప్రవహిస్తుంది. అక్కడ అక్షరాలూ, ఇక్కడ సంభాషణలూ... అంతే తేడా!**



### ఇలా ప్రారంభించాలి...




ప్రస్తుతం ఎనభైనాలుగు దేశాల్లో రెండువేలకుపైగా హ్యూమన్ లైబ్రరీలు ఉన్నాయి. ఎవరైనా సరే, ప్రధాన సంస్థ.. హ్యూమన్ లైబ్రరీ సొసైటీ అనుమతితోనే శాఖను ఏర్పాటు చేసుకోవాలి. ఇందుకు కొంత మొత్తాన్ని ఫీజుగా చెల్లించాల్సి ఉంటుంది. ఆ ప్రక్రియ పూర్తికాగానే... హ్యూమన్ లైబ్రరీ నిర్వహణకు సంబంధించిన నియమావళి అందుతుంది. మంచి పుస్తకాలున్న దుకాణానికే మంచి పేరు. మంచి మానవ పుస్తకాలున్న శాఖలకే జనాదరణ. గాలించి గాలించి మంచి మానవ పుస్తకాల్ని గుర్తించాల్సిన బాధ్యత స్థానిక నాయకత్వానిదే. ఎలాంటి లాభాపేక్షా లేని సంస్థ కాబట్టి, స్వచ్ఛంద సేవకులుగా కూడా మన సహకారాన్ని అందించవచ్చు. దేశంలోని చురుకైన హ్యూమన్ లైబ్రరీ శాఖల్లో హైదరాబాద్ ఒకటి. మార్చి నెలలో....మాస్ మీడియా విద్యార్థి హర్షద్ చొరవతో ఇది ప్రారంభమైంది. ఆన్‌లైన్‌లో హ్యూమన్ లైబ్రరీస్ గురించి చదువుతున్నప్పుడు, ఆ ఆలోచనే అద్భుతంగా అనిపించిందా యువకుడికి. మిత్రులతో కలసి సంఘాన్ని ఏర్పాటుచేశాడు. ఇప్పటికే ఒకట్రెండు సమావేశాలూ పూర్తయ్యాయి. జూలై పదహారున మరో సమావేశం జరగబోతోంది. వివరాలకు హ్యూమన్ లైబ్రరీ, హైదరాబాద్ ఫేస్‌బుక్ పేజీ చూడవచ్చు.

మాత్రం...జాబితాలోంచి తొలగిస్తారు.

### స్వచ్ఛంద సేవ...

ఇదంతా ఓ మంచి ఉద్దేశంతో మొదలైన, స్వచ్ఛంద కార్యక్రమం. సభ్యత్వమూ, పుస్తక హోదా రెండూ ఉచితమే. ఆ ఆలోచన నచ్చి 'హ్యూమన్ లైబ్రరీ'లకు వేదికలుగా ఉండటానికి పుస్తక దుకాణాలూ, కో-వర్కింగ్ కార్యాలయాలూ, కార్పొరేట్ కంపెనీలూ ఉత్సాహంగా ముందుకొస్తున్నాయి. క్యాంపస్‌లలోనూ శాఖలు వెలుస్తున్నాయి. విదేశాల్లో అయితే, లైబ్రరీలు కూడా హ్యూమన్ లైబ్రరీల్ని ప్రోత్సహిస్తున్నాయి.

ప్రతి మనిషీ ఏ అంశం మీదా ముప్పై నిమిషాలకు మించి దృష్టిసారించలేడని నిపుణులు చెబుతారు. అందుకే, మానవ లైబ్రరీలలో పుస్తక పఠనం అరగంటలోపే పూర్తి అవుతుంది. కొన్ని పుస్తకాల్లో సమాచారం ఎక్కువ. కొన్ని పుస్తకాల్లో భావోద్వేగాలు అపారం. ఇంకొన్ని విలువైనవే అయినా, నిస్సారంగా అనిపిస్తూ ఉంటాయి. కానీ, మనసు పెట్టి చదివితే రత్నాలూ మాణిక్యాలే. ఇదే పోలిక మానవ పుస్తకాలకూ వర్తిస్తుంది. మానవ స్వభావాన్ని బట్టి, పుస్తక స్వభావమూ మారిపోతూ ఉంటుంది.

భారతదేశంలో ఇప్పుడిప్పుడే అవగాహన పెరుగుతోంది. మానవ లైబ్రరీలకు వెళ్తున్న వారి సంఖ్య అధికం అవుతోంది. పుస్తకాలుగా పేర్లు నమోదు చేసుకుంటున్నవారు రెట్టింపు అవుతున్నారు. ఫేస్‌బుక్ పేజీలకూ లైకులు వెల్లువెత్తుతున్నాయి. ఈమధ్య ఓ ఊబకాయురాలు తన కష్టాల్ని కథగా చెప్పింది, ఓ వికలాంగుడు తన లైంగిక హక్కుల ఉల్లంఘనను చర్చకుపెట్టాడు. అల్జీమర్స్ రోగి తడబాటు లేకుండా సాధకబాధకాలు వివరించాడు. మానవ గ్రంథాలయాల్లో... సమాజంలో గుసగుసగా మాట్లాడ్డానికి భయపడే విషయాలు కూడా చర్చకు వస్తున్నాయి. నిశ్శబ్దం తొలగిపోతోంది. 'క్యాంపస్‌లో నేను చదువుకున్న రెండేళ్ల చదువూ ఒక ఎత్తు, మానవ లైబ్రరీలో పుస్తక పఠనం మరో ఎత్తు. ఓ మనిషి మనసు విప్పి మాట్లాడితే ఎలా ఉంటుందో అక్కడే మొదటిసారిగా చూశాను' అంటాడు మానసికశాస్త్రంలో పరిశోధన చేయాలనుకుంటున్న రాహుల్ మిశ్రా. 'నిన్నటిదాకా నా సమస్యకు పరిష్కారం లేదనుకునేదాన్ని. ఉంటే గింటే అది చావేనని భ్రమపడేదాన్ని. ఓ పుస్తకంగా నా కథంతా చెప్పాక... నలుగురూ నాలుగు మార్గాలు సూచించారు. జీవితం పట్ల కొత్త ఆశ చిగురించింది' అంటుంది నిన్నమొన్నటిదాకా సెక్స్‌వర్కర్‌గా ఉన్న శాలిని.

### ఒక వైద్యంగా...

ఎవరి పరుగు వారిదై పోయిన సమాజంలో... ఎవరో ఒకరు మన గోడు వింటారంటే - అంతకు మించి కావాల్సిందేముంది? మనసు తేలికపడుతుంది. జీవితం పట్ల కొత్త మమకారం చివురిస్తుంది. హ్యూమన్ లైబ్రరీ మానసిక చికిత్సాలయంగా కూడా పనిచేస్తోందని యూనివర్సిటీ ఆఫ్ వెస్ట్ మినిస్టర్ అధ్యయనంలో వెల్లడైంది. వినడం ఓ చికిత్సే, మాట్లాడటమూ ఓ చికిత్సే! మానవ పుస్తకం, పాఠకుడు... ఎవరికి అవసరమైన వైద్యం వారికి అందుతుంది.

'ఒత్తిళ్ల నుంచి బయటపడాలనీ, అర్థంలేని పరుగును తక్షణం ఆపేయాలనీ రోజూ అనుకునేవాడిని. కానీ కుదిరేది కాదు. అలా సంవత్సరాలు గడిచిపోయాయి. అనుకోకుండా ఓ మానవ లైబ్రరీని సందర్శించాను. బౌద్ధాన్ని ఆచరిస్తున్న ఓ యువకుడు పుస్తకంలా మారిపోయి తన జీవనశైలి గురించి చెప్పాడు. అద్భుతంగా అనిపించింది. నేను కోరుకున్న జీవితం కూడా ఇలాంటిదే' అంటాడు ఇటీవలే బౌద్ధాన్ని స్వీకరించిన గౌతమ్. 'మనసారా మాట్లాడ్డానికి ఓ వేదికంటూ ఉందిప్పుడు. అంతకంటే ఏం కావాలి? నిన్నమొన్నటిదాకా ఇలాంటి అవకాశాల్లేవు. కాబట్టే, మూడుసార్లు ఆత్మహత్యకు ప్రయత్నించాను. హ్యూమన్ లైబ్రరీకి వెళ్లకపోయి ఉంటే... నాలుగో ప్రయత్నమూ జరిగేదేమో' అని ఫేస్‌బుక్‌లో రాసుకున్నారు జార్జ్ అనే ఐటీ ఉద్యోగి.

"ప్రపంచాన్ని చుట్టిరావాలన్నది నా కోరిక. ఆ విషయంలో 'వరల్డ్ టూర్...' మానవ పుస్తకం నాకు బోలెడన్ని సలహాలు ఇచ్చాడు. చాలా చిరునామాలు అందించాడు. చవగ్గా ప్రయాణించడం ఎలాగో చిట్కాలు చెప్పాడు" అని మురిసిపోతాడో యాత్రాప్రియుడు.

మనుషుల్ని చదవడం అలవాటైతే, సమాజాన్ని చదవడమూ అలవాటు అవుతుంది. తారసపడిన ప్రతి వ్యక్తికీ ఏదో ఓ 'ముద్ర' వేసే దురలవాటు పోతుంది. అతడినో, ఆమెనో ఆవైపుగా ఉసిగొల్పిన పరిస్థితుల్ని అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తాం.

వికాసమంటే అదే.... వేయి పుస్తకాల పఠనం తర్వాత సాధించే మానసిక ఉన్నతి కూడా అదే.

**- సండే డెస్క్**













# మిక్చర్ పొట్లం

బొమ్మలు : వెంకట్

## సెలక్షన్

"ఏమండీ .. రేపు మా తమ్ముడికి పెళ్లి చూపులు. మీరూ రావాలి" - కోమలి.



"నేను రానులే కోమలీ .. మీరెళ్లండి" - శోభనాద్రి.

"అలా అనకండి. నాకు కాబోయే మరదల్ని మీరే సెలక్ట్ చెయ్యాలి" గోముగా అంది కోమలి.

"నా సెలక్షన్ అంత బాగో దులే .." తనలో తను గొణుక్కున్నాడు శోభనాద్రి.

## డాక్టర్ అయోమయం



"ఎందుకు డాక్టర్ .. ఉదయం నుండి అదోలా ఉన్నారు?" అడిగింది నర్సమ్మ.

"నిన్న సాయంత్రం నేను ఆపరేషన్ చేసిన పేషెంట్ చని పోయాడు నర్స్" బాధగా చెప్పాడు డాక్టర్.

"మీరు నిన్న సాయంత్రం చేసింది ఆపరేషన్ కాదు డాక్టర్. పోస్టు మార్టమ్" గుర్తు చేసింది నర్సమ్మ.

## పిచ్చివాళ్ల స్వర్గం

ఓ పిచ్చోడు గేదెమీద వెళ్తుండగా గమనించిన మరో పిచ్చోడు -

"ఒరేయ్ నిన్ను పోలీసు పట్టుకుంటాడు".

"ఎందుకురా?"

"నీకు హెల్మెట్ లేదు కాబట్టి".

"కింద చూడు .. ఇది ఫోర్ వీలర్".

## అదీ తేడా



"అమ్మకు, భార్యకూ తేడా ఏమిట్రా?" అడిగింది టీచర్.

"ఒకరు చందమామను చూపిస్తే, మరొకరు చుక్కలు చూపిస్తారు" ఠపీమని బదులిచ్చాడు సుబ్రహ్మణ్యం.

## మిస్టర్ తిరకాసు

"ఏరా అప్పారావు .. వెళ్లినప్పుడు 4 గంటల్లో బెజవాడ వెళ్లావు కదా. వచ్చేప్పుడు 8 గంటలు పట్టిందేం? ట్రాఫిక్ జామా?".

"కాదు. కారు తయారుచేసిన వెధవ ఎవడోగాని ముందుకి వెళ్లడానికి 4 గేర్లు ఇచ్చాడు. వెనక్కి రావడానికి 2 గేర్లు మాత్రమే ఇచ్చాడ్రా".

## నాతో పెట్టుకోకు

సుబ్బారావు భార్య సుందరి పిల్లిని పెంచుకుం టోంది. ఆ పిల్లి అంటే మాచెడ్డ చిరాకు అతగాడికి. అందుకని ఒకరోజు దాన్ని కారులో తనతో పాటు తీసుకెళ్లి దూరంగా వదిలేసి వచ్చేసరికి అది తనకంటే ముందే ఇంట్లో ప్రత్యక్షమై 'మ్యావ్' అని పలకరించి నవ్వింది.



మర్రోజు ఇంకా చాలా దూరం తీసుకెళ్లి వదిలేసి వచ్చాడు. అయినా సరే మళ్లీ ఇంట్లో కనిపించింది. కోపం పట్టలేక దానికి దారి తెలియకుండా చేయాలని ఆ తర్వాతి రోజు కారుని ఎటో ఎటో తిప్పి చాలా దూరం తీసుకెళ్లి వదిలేశాడు. ఆ తొందర్లో సుబ్బారావు ఇంటి దారి మర్చిపోయాడు.

ఏం చెయ్యాలో అర్థంగాక, ఇంటికి ఫోన్ చేశాడు.

"పిల్లిగాని వచ్చిందా?"

"అదిప్పుడే వచ్చింది. ఇంతకీ మీరెక్కడున్నారు?" అడిగింది సుందరి.

"నేను దారి తప్పిపోయి ఇక్కడిక్కడే తిరుగుతున్నాగానీ ముందు నీ చేతిలోని ఫోన్ పిల్లికివ్వు" అన్నాడు సుబ్బారావు.

# ఇప్పటికీ బైక్‌పైనే తిరుగుతుంటా...!

**30 ఏళ్ల కెరీర్‌లో 40 సినిమాలు తీసిన అగ్ర దర్శకుడు రవిరాజా పినిశెట్టి వారసుడు... హీరోగా తెలుగు సినిమాతో పరిచయమైనప్పటికీ, తమిళంలో విభిన్నమైన పాత్రల ద్వారా క్రేజ్ సంపాదించుకున్నాడు... ప్రస్తుతం తెలుగులో ప్రధాన భూమికలు పోషిస్తూ తన సత్తా చాటుకుంటున్నాడు... 'మృగం', 'వైశాలి', 'మరకతమణి' వంటి తమిళ అనువాదాలతో ప్రేక్షకుల్లో ప్రత్యేకస్థానం సంపాదించుకున్న ఆది పినిశెట్టి 'సరైనోడు' బ్లాక్‌బస్టర్ తర్వాత బిజీ అయ్యాడు. "మా నాన్న తెలుగులో అగ్ర దర్శకుడైనప్పటికీ మేము చెన్నైలో ఉండేవాళ్లం కాబట్టి అక్కడ నేను సెలబ్రిటీ కొడుకులా కాకుండా సాదాసీదాగానే పెరిగాను. పైలట్ అవుదామనుకుని అనుకోకుండా సినిమాల్లోకి వచ్చాను" అంటూ ఆది పినిశెట్టి చెబుతున్న విశేషాలు...**

నాన్నగారిది పాలకొల్లు. నేను పుట్టింది అమ్మగారి ఊరు గుంటూరులో అయినా పెరిగింది మాత్రం చెన్నైలోనే. తాతగారు పినిశెట్టి శ్రీరాములుకు నాటకరంగంలో మంచి పేరుంది. 'ఆదర్శ నాట్య మండలి' పేరిట ఎన్నో కార్యక్రమాలు నిర్వహించారు. అల్లు రామలింగయ్య, రేలంగి నరసింహారావు వంటి అనేకమందికి ఆ నాట్యమండలితో అనుబంధం ఉండేది.

నాన్న సినీరంగంపై ఆసక్తితో చెన్నైకు వెళ్లి, అక్కడే స్థిరపడ్డారు. అన్నయ్య (సత్యప్రభాస్ పినిశెట్టి), నేను చెన్నైలోని 'డాన్ బాస్కో' స్కూల్లో చదువుకున్నాం. తంతు.

**పైలట్ కావాలనుకున్నా...**

నాకు ఐదారేళ్ల వయసు వచ్చేసరికే నాన్నగారు తెలుగులో టాప్ డైరెక్టర్. చిరంజీవి, బాలకృష్ణ, వెంకటేష్, మోహన్‌బాబులాంటి అగ్ర హీరోలతో సినిమాలు తీస్తూ నిరంతరం షూటింగులతో బిజీగా ఉండేవారు. ఆ రోజుల్లో సినిమావాళ్లంతా చెన్నైలోనే ఉండేవారు కాబట్టి హీరోల పుట్టినరోజు వేడుకలకు నాన్న మమ్మల్ని సరదాగా వెంట తీసుకెళ్లేవారు. చుట్టూ సినిమా వాతావరణం ఉన్నప్పటికీ నాన్నగారికి మాత్రం మా ఇద్దర్నీ బాగా చదివించాలనే కోరిక ఉండేది. అందుకే ఆ బాధ్యతను అమ్మకు అప్పగించారు. దాంతో నేను ఏది షేర్ చేసుకోవాలన్నా అమ్మతోనే. అంత పెద్ద డైరెక్టర్ అయినా సరే నాన్నకు షూటింగు, ఇల్లు తప్ప వేరే వ్యాపకాలు ఉండేవి కావు. షూటింగ్ అయిపోగానే ఇంటికొచ్చి మాతో గడిపేవారు. నాన్నతో నాకు చనువెక్కువ. తను ఇంటికొచ్చేసరికి నేను నిద్రపోతే, నిద్రలేపి మరీ ఏదైనా తినిపించేవారు.






ఇంటి ముందు నాలుగు కార్లు ఉన్నా సరే, స్కూలుకు బస్సులోనే వెళ్లేవాళ్లం. సింపుల్‌గా ఉండటం చిన్నప్పటినుంచే అలవాటు చేశారు నాన్న.

సత్యరాజ్‌గారి అబ్బాయి శిబిరాజ్, ప్రభుగారి అబ్బాయి విక్రమ్‌ప్రభు నాతో పాటే చదువుకున్నారు. సెలవుల్లో మాత్రం పాలకొల్లుకు వెళ్లేవాళ్లం. నాన్నగారిది పెద్ద కుటుంబం. ఎప్పుడూ సందడిగా ఉండేది. ఎక్కడున్నా సరే నేను చాలా తొందరగా ఒక గ్రూపు ఏర్పాటుచేసుకుంటాను. ఆ విధంగా పాలకొల్లులో నా వయసువారితో కలిసి చెరువులో చేపలు పట్టడం, చుట్టుపక్కల జరిగే జాతరలకు వెళ్లడం బాగుండేది. అమ్మగారి ఊరిలో కూడా ఇదే పండగలకు, పబ్బాలకు ఆయన టీమ్ మొత్తం మా ఇంట్లోనే ఉండేది. అరవై, డెబ్బై మందితో ఇల్లంతా కళకళలాడేది.

చెన్నైలోని ఎస్‌వీసీఈ (శ్రీ వెంకటేశ్వర కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్)లో కంప్యూటర్ ఇంజనీరింగ్ చేశాను. నాన్నగారు పెద్ద డైరెక్టర్ అయినప్పటికీ కాలేజీలో నన్నెవరూ సెలబ్రిటీ కొడుకులా చూసేవారు కాదు. దానికి కారణం నా ఫ్రెండ్స్‌కు తమిళ సినిమాలే తప్ప తెలుగు సినిమాలతో పరిచయం ఉండేది కాదు. కాలేజీ సిటీకి 45 కిలోమీటర్ల దూరంలో ఉండేది. కాలేజీ బస్సులో వెళ్లడం, అప్పుడప్పుడు కాలేజీ ఎగ్గొట్టి సినిమాలు, షికార్లకు చెక్కేయడం, బైకు మీద చెన్నై వీధుల్లో తిరగడం మర్చిపోలేని అనుభవం. ఎప్పుడో ఒకసారి అది కూడా సెలవుల్లోనే నాన్నగారి షూటింగులకు వెళ్లేవాణ్ని. చదువు పాడవుతుందని నాన్న అడ్డు చెప్పడంతో, నేను కూడా షూటింగులంటే పెద్దగా ఆసక్తి చూపేవాడిని కాదు. ఇంజనీరింగ్ అయిపోయిన తర్వాత పైలట్ కావాలనే

కల ఉండేది.

**సినిమాల్లోకి రావడం 'ఒక విచిత్రం'...**

నాన్నగారి కోసం ఇంటికొచ్చే చాలామంది నిర్మాతలు 'మీ అబ్బాయిని హీరో చేస్తారా?' అంటూ అడిగేవారు. ఆయన వారికి ఏం సమాధానం చెప్పేవారు కాదు. నేను కూడా సినిమాలపై పెద్దగా దృష్టి పెట్టేవాణ్ణి కాదు. ఒకరోజు డైరెక్టర్ తేజగారు నా గురించి నాన్నగారి దగ్గర ప్రస్తావించడం... ఆయన చెప్పిన కథ కొత్తగా ఉండటంతో సరదాగా సరే అన్నాను. అప్పటికీ నటన అంటే ఏమిటో కూడా నాకు తెలియదు. నెలన్నర పాటు వైజాగ్‌లో సత్యానంద్‌గారి దగ్గర శిక్షణ తీసుకోమన్నారు. ఆ తర్వాత 'ఒక విచిత్రం' సినిమా షూటింగ్ ప్రారంభమైంది. కెమెరాముందు తేజగారు చెప్పినట్టు చేశాను కానీ అప్పటికి నటనపట్ల సీరియస్‌గా లేను. సినిమా పూర్తయిన తర్వాత అమెరికాలోని పనామా యూనివర్శిటీలో పైలెట్ ట్రైనింగ్‌కు అప్లయ్ చేశాను. అదే సమయంలో తమిళ 'మృగం'లో హీరోగా తొలి అవకాశం వచ్చింది. అది కూడా ఒక డిఫరెంట్ సినిమా. నిజానికి అలాంటి పాత్రను ఏ హీరో కూడా ఒప్పుకోడు. కానీ నాకు పాత్ర బాగా నచ్చి చేశా. అందులో నా నటన అందరికీ నచ్చింది. ఆ సినిమా ఒప్పుకోకుండా డిఫరెంట్ సినిమాలను మాత్రమే ఎంచుకుంటున్నా. నేను సినిమాలు చేస్తున్నది డబ్బు కోసం మాత్రమే కాదు... నా సంతృప్తి కోసం. ఏదో ఒకరోజు వెనక్కి తిరిగి చూసుకుంటే ఇన్ని వెరైటీ రోల్స్ చేశాననే తృప్తి ఉండాలి కదా. నాని 'నిన్ను కోరి', రామ్‌చరణ్ 'రంగస్థలం', త్రివిక్రమ్-పవన్‌కళ్యాణ్ కాంబినేషన్‌లో రూపొందుతున్న సినిమాల్లో ప్రధాన పాత్రలు పోషిస్తున్నా. ఒకవైపు తమిళంలో హీరోగా చేస్తూనే, తెలుగులో ప్రధాన పాత్రలు, నెగిటివ్ రోల్స్ చేయడం ద్వారా నటుడిగా నన్ను నేను ప్రూవ్ చేసుకోవాలనుకుంటున్నా. మొదటి నుంచి నా కెరీర్‌ను గమనిస్తే హీరోనా, విలనా అనే తేడాలు నేనెప్పుడూ పట్టించుకోలేదు. ఛాలెంజింగ్‌గా ఉన్న ఎలాంటి పాత్రనైనా చేసేందుకు సిద్ధపడ్డా. ఇకముందు కూడా నా జర్నీ ఇలాగే కొనసాగుతుంది.

ఇప్పటికీ సెలబ్రిటీ గుర్తింపు కన్నా సింపుల్‌గా ఉండటాన్నే ఇష్టపడతా. చెన్నైలో ఉన్నా హైదరాబాద్‌లో ఉన్నా టీషర్ట్, జీన్స్ వేసుకుని బైక్ మీదే సిటీ అంతా తిరుగుతా. వివిధ ప్రాంతాలు తిరుగుతూ రకరకాల మనుషులతో మాట్లాడుతూ వారి వారి సంస్కృతి గురించి, జీవన విధానం గురించి తెలుసుకోవడమంటే చాలా ఇష్టం. చెన్నైలో నా క్లోజ్‌ఫ్రెండ్స్ చాలామందే ఉన్నారు. వాళ్లు నా సినిమాలు చూసి విమర్శిస్తూ, ఏడిపించడం సరదాగా అనిపిస్తుంది. పేరెంట్స్ పెళ్లి చేసుకొమ్మని చాన్నాళ్లుగా పోరుతున్నారు. బహుశా ఈ యేడాదితో బ్యాచిలర్ లైఫ్‌కు ఫుల్‌స్టాప్ పెడతానేమో. తప్పకుండా అమ్మానాన్నలు చూసిన అమ్మాయినే చేసుకుంటా. ఈ లోపు నాకెవరైనా నచ్చితే చెప్పలేను. ప్రేమ ఎప్పుడు, ఎక్కడ పుడుతుందో తెలియదు కదా. అయితే ఇంట్లోవాళ్ల మాత్రం నా ఇష్టాన్ని కాదనరని కచ్చితంగా చెప్పగలను. ఇప్పటిదాకా ఏ విషయంలో కూడా వారి అభిప్రాయాలను నాపై బలవంతంగా రుద్దలేదు. మొదట్నుంచి పేరెంట్స్ ఆ ఫ్రీడమ్ నాకిచ్చారు. అది సినిమాలైనా, జీవితమైనా!







ఫ్యామిలీతో...

తర్వాత నటనపై సీరియస్‌నెస్ వచ్చింది. రెగ్యులర్ హీరోగా కాకుండా డిఫరెంట్ సినిమాలు చేస్తే తప్పకుండా క్లిక్ అవుతాననే నమ్మకం ఏర్పడింది. నా నమ్మకం నిజమై 'ఈరం' (తెలుగులో వైశాలి) సూపర్‌హిట్ కావడంతో వెనక్కి తిరిగిచూసుకునే అవకాశం రాలేదు. తమిళంలో నాకు గుర్తింపు వచ్చిన తర్వాత ప్రతీ సినిమా తెలుగులోకి కూడా అనువాదమవుతూ వచ్చింది. 'ఏకవీర', 'మరకతమణి' అలా వచ్చినవే.

**'సరైనోడు' అన్నారంతా...**

తెలుగులో తొలి సినిమా చేసినా ఆ తర్వాత తమిళంలో గుర్తింపు తెచ్చుకోవడం, వాటి అనువాదాల ద్వారా తెలుగు ప్రేక్షకులు నన్ను ఆదరించడం వింతైన అనుభవం. 'ఒక విచిత్రం' తర్వాత ఏడేళ్లకు (2013) తెలుగులో స్ట్రయిట్ సినిమా 'గుండెల్లో గోదారి' చేశాను. అన్నయ్య డైరెక్ట్ చేసిన ద్విభాషా చిత్రం 'మలుపు' తర్వాత అదే యేడాది (2016) 'సరైనోడు' ద్వారా తెలుగులో కొత్త ఇమేజ్ వచ్చింది. అల్లు అర్జున్ పాత్రతో పాటు నా పాత్ర కూడా ప్రేక్షకులకు విపరీతంగా నచ్చింది. ఆ సినిమా తర్వాత హీరోగా చేయమని అరడజను ఆఫర్లు వచ్చాయి. కానీ కెరీర్ పట్ల నాకు స్పష్టత ఉంది. అందుకే ఏదిపడితే అది

● చల్లా శ్రీనివాస్

- ఫ్యాషన్ దుస్తులు సినిమాలకే పరిమితం. బయట సింపుల్‌గా ఉంటా.
- పుస్తకాలు చదవడం, ట్రావెలింగ్ అంటే ఇష్టం.
- అమ్మ చేతివంటను అస్సలు మిస్సవ్వను. చేపల కూర, బంగాళదుంప వేపుడు బాగా చేస్తుంది. సీఫుడ్ ఎక్కువగా ఎంజాయ్ చేస్తా. అరుదుగా దొరికే పులస చేపలు ఇష్టంగా తింటా.
- నాన్న తీసిన సినిమాల్లో పుణ్యస్త్రీ, ముత్యమంతముద్దు, పెదరాయుడు, జ్వాల, రుక్మిణి బాగా నచ్చుతాయి.
- 'ఏకవీర' 18వ శతాబ్దంలో జరిగిన కథ కాబట్టి ఆ సినిమా కోసం రెండున్నరేళ్లు కష్టపడ్డా.
- డ్రీమ్‌రోల్స్ అంటూ ఏవీ లేవు. నటుడిగా ప్రయాణాన్ని ఎంజాయ్ చేయాలనుకుంటా.
- డైరెక్షన్ వైపు వెళ్లే ఆలోచన లేదు.

క్రైమ్ స్టోరీ

# ప్రేమకోసం...

**అర్ధరాత్రి నడుచుకుంటూ వచ్చి తలుపు కొట్టాడు బంటీ. సరిత తలుపు తీసింది. అతడి చేతిలో రైఫిల్‌ని చూసి, గుసగుసగా 'ఆ రూము... అటు ఇంకో రూము' అని చూపించింది. మొదటి రూంలోకెళ్ళాడు బంటీ. గాఢనిద్రలో ఉన్నాడు సరిత భర్త. రైఫిలెత్తి ఒక్క పెట్టున కాల్చేశాడు అతణ్ణి. పక్క రూంలో కెవ్వుమన్న కేక విని, వెళ్లి చూసి అత్తగార్నీ కాల్చేశాడు. సరిత చేయి పట్టుకుని, 'పద!' అన్నాడు. అతడితో అడుగులేసింది సరిత.**

• • •

హరిద్వార్, హృషికేశ్, నైనిటాల్, మనాలి, సిమ్లా తిరిగేస్తూంటే జీవితం కలలాగా ఉంది ఇద్దరికీ. మళ్ళీ కలుస్తామనుకోలేదు. ఇలా హనీమూన్ జరుపుకుంటామనుకోలేదు. చేసిన రెండు హత్యలు వాళ్ళ ఆనందాలకేమీ అడ్డురావడం లేదు. పాతికేళ్ళ బంటీ, 22 ఏళ్ల సరిత పెళ్లి చేసుకుని హనీమూన్ ఎంజాయ్ చేస్తున్నారు. బంటీకిది రెండో పెళ్లి, సరితకు మూడో పెళ్లి.

"ఇప్పుడు మనల్ని ఎవరు విడదీసినా వాళ్ళకి చావే, మనకింకో పెళ్ళే! ఏమంటావ్?" అంటున్న బంటీని చూసి కిలకిలా నవ్వి- "ఈసారి పట్టుకుంటే విడాకులకు ఒప్పుకోవద్దు మనం" అంది సరిత. బంటీ జేబులోంచి కత్తి తీసి చూపిస్తూ, "దీంతో ఐపోతారు మన జోలికొస్తే" అని కర్కశంగా చెప్పాడు.

"ఇదెక్కడిది? చెకింగ్స్‌లో ప్రాబ్లమవుతుంది, పారేయ్!" అని లాక్కుని దూరంగా విసిరేసింది. వెళ్లి తెచ్చుకుని- "పిచ్చిదానా, మనం పారిపోయిన లవర్సా ఇప్పుడూ? పరారైన కిల్లర్స్, గుర్తుంచుకో!" అని హెచ్చరించాడు.

"ఇలా భయపెట్టే మాటలు చెప్పకు బాబూ" అంది అల్లుకుపోతూ. కారు చీకట్లో కాటేజీ నిట్టూర్పులతో వేడెక్కుతోంది...

• • •

"ఏంటీ, తిని పడుకుంటే వాడు దొరుకుతాడా? పోలీసులు పట్టుకునేలోగా వాణ్ణి పట్టుకో, దాని మొగుణ్ణి చంపి దాంతో లేచిపోయాడు వాడు" అంటున్న భార్య మీద విసుక్కున్నాడు బంటీ తండ్రి వసంత్ సింగ్- "వాడిప్పుడు హంతకుడు! అప్పుడు వాణ్ణి పరువు కోసం పట్టి తెచ్చాం, ఇప్పుడేమని తెస్తావే? ఊస్తారు జనాలు".

హర్యానాలోని సోనేపట్‌లో నెల రోజుల క్రితమే ప్రేమించిన సరితతో పారిపోయి పెళ్లి చేసుకున్న కొడుకు బంటీని, వెతికి పట్టుకుని విడాకులిప్పించారు. సరితకు వేరే పెళ్ళయిపోయింది. పెళ్ళయిన వారానికే సరిత భర్తనీ అత్తగార్నీ చంపేసి మళ్ళీ సరితతో పారిపోయి పెళ్లి చేసుకున్నాడు!

• • •

నెలరోజులు గడిచిపోయాయి...

"విసుగేస్తోందా హనీమూను? హనీమూన్ కాదనుకో, పరారీ అనుకో, ఉత్సాహం వస్తుంది" అని జోకేసిన బంటీని లాగి ఒకటి కొట్టి, "డబ్బులైపోతే ఏం చేస్తావ్? జాబ్ పోయింది, రేపేంటో ఆలోచించావా? నన్ను ఆకలికి మాడిస్తే మాత్రం ఊరుకోను!" అంది సరిత.

ఆలోచనల్ని కంట్రోలు చేసుకోకపోతే ఈ ఆలోచనలే కంట్రోలు చేయలేని ఎమోషన్స్‌గా మారి తామిద్దర్నీ విడదీస్తాయనీ, పెళ్ళంటే ఒకే ఒక్క ఆకలి అనీ, అది పెనవేసుకుని తీర్చుకునేదనీ హితబోధ చేశాడు బంటీ. రెండుసార్లు పెళ్లి చేసుకున్న అనుభవంతో చెప్తున్నానన్నాడు.

చండీఘర్‌లో ఇన్‌స్పెక్టర్ సుచాసింగ్ న్యూస్ చదువుతూ బంటీ గురించి ఆలోచనలో పడ్డాడు. అంబాలాలో కాపురం పెట్టారిద్దరూ. ఇంకో నెలరోజులు ఎంజాయ్ చేశారు. అప్పుడు అనుమానం వ్యక్తం చేసింది సరిత తన శారీరక స్థితి గురించి... "వాడా? నేనా? వాడితో వారం ఉన్నావ్. సరే ఎవరైతే ఏముందిలే, పెంచుకుందాం" అని అడ్జెస్టయ్యాడు బంటీ.

"అంబాలా బాగా లేదు, మనం చండీఘర్‌లో సెటిలవుదాం" అంది సరిత.

"నువ్వేం చదివావ్? పదకొండా? జాబ్ చేస్తావా? చండీఘర్‌లో ఖర్చెక్కువ"

"జాబ్ ఎలా చేస్తా? బ్యాక్‌గ్రౌండ్ చెక్ చేస్తారు!"

"నా ప్రాబ్లం కూడా అదే. అందుకే బ్యాంక్ బ్యాలెన్స్ జాగ్రత్తగా ఖర్చు పెట్టుకుంటూ ఇక్కడే ఉందాం"

"ఆ తర్వాత?"

"లొంగిపోతామేమో!"

"లొంగిపోతామా!"

"కన్నం వేద్దామా లేకపోతే?"

"అలా చెప్పు, నిండా మునిగాక చలేముంది... దోపిడీలు చేద్దాం"

భవిష్యత్ ప్రణాళిక వేసుకోసాగారు...

చండీఘర్‌లో ఇన్‌స్పెక్టర్ సుచాసింగ్‌కి ఈ కేసులో హర్యానా పోలీసులేం చేస్తున్నారో అంతు పట్టలేదు. రెండు హత్యలు జరిగి రెండు నెలలు దాటిపోయాయి. హత్యలు చేసిన బంటీ ఏమయ్యాడో- ఎందుకు వాణ్ణి గాలించడం లేదో అర్థం గావడం లేదు. రాజకీయ వొత్తిళ్ళు పనిచేస్తున్నాయేమోనన్న అనుమానం వేసింది.

ఆ రాత్రి చండీఘర్ బయల్దేరారు బంటీ సరితలు. హర్యానా, పంజాబ్‌ల ఉమ్మడి రాజధాని చండీఘర్ చూడాలని సరిత ఒకటే పోరు పెడితే తీసుకుని వచ్చాడు బంటీ. బస్‌స్టేషన్లో బస్సు దిగి వెళ్తూంటే డ్యూటీ మీద ఉన్న ఇన్‌స్పెక్టర్ సుచాసింగ్ ఎదురయ్యాడు. అతణ్ణి చూసి అప్రమత్తమయ్యాడు బంటీ. బంటీని వెంటనే గుర్తు పట్టాడు ఇన్‌స్పెక్టర్ సుచాసింగ్-

"లొంగిపో!" అనేంతలో కత్తి తీసి పొడిచేశాడు బంటీ. అవాక్కయ్యాడు సుచాసింగ్. మళ్ళీ పొడిచేశాడు బంటీ- "ఒరేయ్! నువ్వు పోలీసువి కాదా? ఇన్‌స్పెక్టర్‌నే పొడుస్తావేంట్రా!" మెలికలు తిరిగిపోతూ అరవసాగాడు సుచాసింగ్.

పొడుస్తూనే ఉన్నాడు కానిస్టేబుల్ బంటీ, అలియాస్ బసంత్ సింగ్- ఇన్‌స్పెక్టర్ సుచాసింగ్‌ని నిర్దాక్షిణ్యంగా. ప్రాణాలొదిలి కుప్పకూలాడు సుచాసింగ్.

తెలతెలవారుతూండగా సోనేపట్‌లోని వసంత్‌సింగ్ ఇంటి తలుపు తెర్చుకుంది. వాళ్ళిద్దర్నీ చూస్తూ నిలబడ్డాడు వసంత్‌సింగ్. ఇద్దరూ లోపలికొస్తున్నా మాట్లాడలేదు. ఆ తర్వాత బయటికెళ్ళి ఫోన్ చేయసాగాడు పోలీసులకి.

● **సికిందర్**






ట్రెండ్స్

# ఇక్కత్... ఖూబ్‌సూరత్!

ఇక్కత్ చీర కట్టగానే ఎక్కడలేని హుందాతనం వచ్చేస్తుంది. ఆకర్షించే వర్ణాలతో, జామెట్రిక్ డిజైన్లతో, చెదిరిన పూల హంగులతో, కంటికింపైన రంగులతో... ఆ చీరకట్టులోని కనికట్టే వేరు. ఇక్కత్ చీరకు జతగా చెవులకు బంగారు జుంకాలూ, చేతికి బోలెడన్ని మట్టిగాజులూ వేసుకుంటారు చాలామంది, అంతకు మించిన 'సంప్రదాయ' ప్రత్యామ్నాయం లేదు కాబట్టి. ఇప్పుడా అవసరం లేనేలేదు. ఇక్కత్ స్వర్ణాభరణాలు వచ్చేశాయి. చీరలకు మ్యాచింగ్‌గా చెవి రింగులు, గాజులు, ఉంగరాలు, హారాలు, పెండెంట్లు, బ్రాస్‌లెట్లు అందుబాటులో ఉన్నాయి. మరీ నచ్చితే చెప్పులు కూడా ఇక్కత్‌వే వేసుకోవచ్చు. నెయిల్‌పాలిష్‌లోనూ ఇక్కత్ ముద్ర కనిపిస్తోంది. ఇక్కత్ డిజైన్లకు ఇండొనేషియా, జపాన్ తదితర దేశాల్లో కూడా మంచి ఆదరణ ఉంది. అతి ప్రాచీనమైన నేత సంప్రదాయమిది. తెలంగాణ గడ్డ మీద... పోచంపల్లి ఆ సంప్రదాయానికి చెందిన చేనేత కళే! ఇక్కత్‌కు ఇండొనేషియాలో మూలాలున్నట్టు చరిత్రకారులు గుర్తించారు. అయినా, ఫ్యాషన్‌కు హద్దులూ సరిహద్దులూ ఏం ఉంటాయి. ఎక్కడ ఏ కాస్త మెరుపు కనిపించినా... డిజైనర్లు పట్టేసుకుంటారు, మెరుగులు పెట్టేసుకుంటారు. ఈ ఫ్యాషన్ సీజన్‌లో ఇక్కత్ వంతు! ❇



ట్రావెలోకం

# ఆ దేశంలోనూ... ఓ అమరావతి

**మన తెలుగు నేలకి వియాత్నాం చాలా దూరంలోనే ఉంది. కాని అక్కడి వేలాది శిథిలాల మధ్య వందల శిల్పాల మధ్య నిలుచుంటే... వాటి రూపురేఖలను సరిపోల్చుకుంటే.. కదలలేని మెదలలేని ఆ శిల్పాలే మన బంధువుల్లా కన్పిస్తాయి. వేల సంవత్సరాల నాటి మన తాతముత్తాతల వీరగాథలని చెప్పడానికి ప్రయత్నిస్తాయి. వింతైన ఆ విశేషాలను అందిస్తున్నారు హైదరాబాద్ వాస్తవ్యురాలైన డి.పి.అనురాధ మన కోసం...**

వియాత్నాం వీరగాథలు చదివీ చదివీ ఆ దేశమంటే ఎంతో మక్కువ ఏర్పడింది. యుద్ధంలో అమెరికానే ఓడించిన ఆ నేలను చూసే భాగ్యం మాత్రం ఈమధ్యే  కలిగింది. ఎస్ అక్షరం ఆకారంలో పొడవుగా, వెడల్పు తక్కువగా ఉండే ఆ దేశాన్నంతా చూడాలంటే కష్టమే. మావారి అభిరుచికి తగినట్టు దనాంగ్ నగరాన్ని మా పర్యాటక కేంద్రంగా ఎంచుకున్నాం. దనాంగ్ సెంట్రల్ వియాత్నాంలో ఉంది. ఆ దేశంలో మూడో అతి పెద్ద నగరం.

హైదరాబాద్ నుంచి దనాంగ్‌కు డైరెక్టు ఫ్లయిట్ లేదు. కనెక్టివ్ విమానాల్లో వెళ్లేసరికి సాయంత్రం 6 గంటలు అయిపోయింది. ఎయిర్ పోర్ట్‌లో చాలా టూరిజం కేంద్రాలు ఉన్నాయి. పెయిడ్ టాక్సీలో ఓ హోటల్‌కి బయల్దేరాం. ఆ రాత్రి వేళలో మమ్మల్ని ఎంతో ఆకర్షించింది డ్రాగన్ బ్రిడ్జ్. వియాత్నాంలోనే అతి పొడవైన బ్రిడ్జి ఇది. 666 మీటర్ల పొడవులో హాన్‌నదిపై బంగారు డ్రాగన్ ఆకారంలో నిర్మించారు. దనాంగ్ బీచ్‌లకు ప్రసిద్ధి. రోడ్డుకు ఓ పక్కన బీచ్, మరో పక్కన ఎత్తయిన హోటల్స్. రోడ్డు నుంచి ఓ 30 అడుగులు ఇసుకలో వేస్తే సముద్ర అలలని తాకొచ్చు.





ఉదయం ఓ టాక్సీ మాట్లాడుకుని సిటీ ఎట్రాక్షన్స్ చూడటానికి బయల్దేరాం. ముందుగా సన్ ట్రా మౌంటెయిన్స్ నేషనల్ పార్క్‌కు వెళ్లాం. దనాంగ్ నుంచి 35 నిమిషాలు ప్రయాణం. సముద్ర మట్టం నుంచి 693 మీటర్ల ఎత్తులో ఉండే ఈ పర్వతాలన్నీ పచ్చని చెట్లతో కళకళలాడుతూ ఉన్నాయి. ఇక్కడి వింతల్లోకెల్లా వింత లేడీ బుద్ధా స్టాట్యూ. 72 మీటర్ల ఎత్తయిన ఈ పాలరాతి స్త్రీ బుద్ధ ప్రతిమ అల్లంత దూరం నుంచే ఆకర్షిస్తుంది. నౌకా వాణిజ్య కేంద్రంగా ఉన్న దనాంగ్‌లో నావికులను లేడీ బుద్ధా తన చల్లని చూపులతో రక్షిస్తుందని నమ్మిక.

ఆ తరవాత మేం చామ్ మ్యూజియం వెళ్లాం. అక్కడ ఉన్న శిల్పాలను చూస్తుంటే హైదరాబాద్ స్టేట్ మ్యూజియం లోనో.. నాగార్జున కొండ మ్యూజియం లోనో ఉన్నట్టుగా అన్పించింది. ఎందుకంటే అక్కడ శివ లింగాలు, పార్వతి, లక్ష్మి, గణపతి, వేణుగోపాల స్వామి, బుద్ధుడు, అప్సరసలు తదితర శిల్పాలే ఉన్నాయి. క్రీస్తు శకం 2వ శతాబ్ది నుంచి 19వ శతాబ్దం వరకు మధ్య వియాత్నాం అంతా చంపా రాజ్యంగా ఉండేది. ఈ వంశ రాజులను... అక్కడి ప్రజలు చామ్‌లుగా పిలుస్తారు. హిందూ రాజ్యమైన చంపాపై భారతదేశ ప్రభావం స్పష్టంగా ఉందని అక్కడ పేర్కొనడం విశేషం. ఈనాటికీ ఆ రాజ్య సాంస్కృతిక అవశేషంగా దనాంగ్‌కు 75 కిలోమీటర్ల దూరంలో మిసన్ సిటీ అని ఉందనీ అక్కడ మరిన్ని వివరాలు తెలుసుకోవచ్చనీ ఆ మ్యూజియంలో గైడ్ తెలియజేశాడు. అమరావతి, ఇంద్రపుర, సింహపుర, వీరాపుర వారి రాజధాని నగరాలుగా ఉండేవనీ, ఇప్పుడూ ఆ నగరాలు ఉన్నాయనీ, వియాత్నాం ఏకీకరణ తరవాత వాటికి వియత్నమిస్ పేర్లు పెట్టారనీ ఆయన చెప్పాడు. ప్రస్తుతం అమరావతిని క్వాంగ్ నామ్ ప్రావిన్సుగా పిలుస్తున్నారట. మిసన్ సిటీ పరిసర ప్రదేశాలన్నీ క్వాంగ్ నామ్ ప్రావిన్సులోకే వస్తాయట. మరుసటి రోజు మా ప్రయాణం మిసన్ సిటీగా తీర్మానించుకున్నాం.

ఉదయం 8 గంటలకే టాక్సీలో బయల్దేరాం. 'మిసన్ సిటీ - ది వరల్డ్ హెరిటేజ్ సైట్' అనే ఆర్చి ఉన్న చోట మమ్మల్ని దింపేశాడు డ్రైవర్. అక్కడ పురాతత్వ ఆనవాళ్లు ఏవీ కన్పించలేదు. కానీ మ్యూజియం ఉంది. చంపా రాజ్యానికి సంబంధించి చాలా వివరాలే లభించాయి. దంగ్ దౌంగ్ అనే ప్రాంత శిథిలాలలో అచ్చం మన అమరావతి రీతిలో ఉన్నటువంటి బుద్ధుడి శిల్పం బయటపడిందట. ఆ శిల్పానికి నేటికీ

అమరావతి బుద్ధుడు అనే పేరు. మిసన్ సిటీలో మొట్టమొదట ఆలయం కట్టించిన చక్రవర్తి భద్రవర్మ. క్రీస్తుశకం 4వ శతాబ్దిలో నిర్మించిన ఈ ఆలయం శివ భద్రేశ్వర ఆలయంగా ప్రాచుర్యం పొందింది. ఆ తరవాత చాలా మంది రాజులు ఇక్కడ ఆలయాలు నిర్మించారట. గొప్ప సాంస్కృతిక కేంద్రంగా మిసన్ ఉండేది. చంపా రాజ్యంలో భద్రవర్మ తరవాత ప్రసిద్ధిచెందిన రాజు ఇంద్రవర్మ. చక్రవర్తిగా పట్టాభిషేకం కాకముందు ఇంద్రవర్మ పేరు భూములవార గ్రామస్వామి. అచ్చమైన తెలుగు పేరు. చంపా లిపికి మూలం దక్షిణ భారతదేశానికి చెందిన పల్లవ లిపి. క్రీస్తు శకం 8వ శతాబ్దికి ముందు ఉన్న చంపా శిల్పంపై అమరావతి శైలి ప్రభావం పూర్తిగా ఉందని అక్కడ స్పష్టంగా పేర్కొనడం విశేషం. శాలంకాయనులు, పల్లవుల పేర్ల చివరన వర్మ అని ఉండడం పరిపాటే. చంపా రాజ్య స్థాపకులతో వీరికి దగ్గర సంబంధాలు ఉండి ఉంటాయి. తొలి శతాబ్దాల్లో నౌకాయానంలో తెలుగువారిది అందెవేసిన చేయి. సాహసానికి మారుపేరైన మన వాళ్లు ఇంత దూరం వచ్చి అన్నీ అనుకూలించడంతో భద్రపరిచారట. వీటిని పరిరక్షించడానికి వియాత్నాం ప్రభుత్వం గట్టిప్రయత్నాలే చేస్తోంది. మన ముత్తాతలు భద్రవర్మ, ఇంద్రవర్మ... తిరుగాడిన ఆ నేలను తినివితీరా చూసి, ఆ ఆలయ గోడలను తన్మయత్వంతో తాకి మనసులో వారికి గట్టి నివాళులు అర్పించుకుని మిసన్ నుంచి భారమైన హృదయంతో వచ్చేశాం.

మా తదుపరి మజిలీ హలీయాన్. ఇది కూడా అమరావతి ప్రావిన్సులోనిదే. అప్పటి చంపా రాజ్య వర్తక నగరం. మిసన్ సిటీ నుంచి ఓ గంట ప్రయాణం. హలీయాన్ గురించి చాలా విశేషాలే ఉన్నాయి. హలీయాన్ మధ్యయుగాల్లో అతి పెద్ద నౌకావాణిజ్య కేంద్రంగా ఉండేదట. భారతదేశం, చైనా మధ్య ఉన్న వియాత్నాంను గతంలో ఇండో చైనా అని పిలిచేవారు. ఈ రెండు దేశాల వర్తకులే కాకుండా 17వ శతాబ్దంలో ఫ్రెంచువారు, ఆ తరవాత జపనీస్, ఇంగ్లీష్ వారు ఇలా అన్ని జాతీయుల వారు ఇక్కడ మజిలీ చేయడం వల్ల గొప్ప అంతర్జాతీయ వాణిజ్య కేంద్రంగా హలీయాన్ పేరుతెచ్చుకుంది. గత









స్థానికులతో రచయిత్రి

వలస రాజ్యాలను స్థాపించి ఉండవచ్చు. అలా నా మనసు పరిపరి ఆలోచనలకు ఏకరూపమిచ్చి చంపారాజ్యం మన తెలుగువారిదే.. మన తాత ముత్తాతలదే.. అని తేల్చేసింది.

పక్కనే ఉన్న కౌంటర్‌లో ఎంట్రీ టికెట్ తీసుకుని బ్యాటరీతో నడిచే ఓ వెహికిల్‌లో మిసన్ సిటీకి బయల్దేరాం. ఒకప్పుడు 70 దాకా పురాతన ఆలయాలు ఉండేవట. అమెరికా ఇండోచైనా యుద్ధంలో అమెరికా వేసిన కార్పెట్ బాంబింగ్‌లో ఇక్కడ చాలా నిర్మాణాలు ధ్వంసమయ్యాయి. రెండు కిలోమీటర్ల పరిధిలో ప్రస్తుతం 30 పురాతత్వ ప్రదేశాలు ఉన్నాయి. వీటిని క్రీస్తు శకం 4వ శతాబ్ది నుంచి 14వ శతాబ్ది వరకూ నిర్మించారట. ఒక వరుసక్రమంలో వాటిని సందర్శించేలా కాలి బాటలు వేశారు. అక్కడ ఆలయాల శిథిలాలు ఎన్నో ఉన్నాయి. కేవలం బయటి నిర్మాణాలే... ఆకారానికి అన్నట్టుగా ఉన్నాయి. లోపలి శిల్పాలను వెలికి తీసి వివిధ మ్యూజియాలలో

శతాబ్ది కాలంలో హలీయాన్ స్థానాన్ని దనాంగ్ ఆక్రమించిందట. అయినా రెండు శతాబ్దాల నాటి నిర్మాణాలను పునరుద్ధరించి వియాత్నాం ప్రభుత్వం ఏన్సియంట్ సిటీ ఆఫ్ హలీయాన్‌గా తీర్చిదిద్ది టూరిస్టుల కోసం ప్రత్యేక నగరంగా రూపొందించింది. ప్రస్తుతం హలీయాన్ యునెస్కో వాల్డ్ హెరిటేజ్ సైట్‌గా ప్రసిద్ధిచెందింది.

హలీయాన్ సిటీ ప్రవేశ ద్వారం దగ్గర మా టాక్సీ డ్రైవర్ ఆపేశాడు. మోటార్ వెహికిల్స్‌కు హలీయాన్ నగరంలో అనుమతి లేదట. ఈ నగరమంతా తిరిగిచూడటానికి 3 గంటల సమయం పడుతుందని చెప్పాడు. ఎంట్రీ టికెట్ తీసుకుని హలీయాన్ నగరంలో అడుగుపెట్టాం. ఓ రెండు వందల ఏళ్ల వెనక్కి వెళ్లినట్టుగా అన్పించింది. ఇరుకైన రహదారులు.. వింతైన నిర్మాణాల ఇళ్లు.. రోడ్డుకు ఓ వైపు రకరకాల షాపులు.. ఓ వైపు ప్రవాహమే లేని నీళ్లతో తూ బాన్ నది.. అందులో రంగురంగుల బోట్లు. కొందరు వియత్నమీస్ నవదంపతుల్లా వస్త్రధారణ చేసుకుని ఆ బోట్లలో ఫోటోలు వీడియోలు తీయించుకుంటున్నారు.

హలీయాన్ వీధులను చూస్తూ అలా ముందుకు వెళుతుంటే బాన్ నది మీద 17వ శతాబ్ది నాటి జపనీయుల కలప బ్రిడ్జి వచ్చింది. హలీయాన్ టైలర్ షాపులకు ప్రసిద్ధి. కొన్ని వీధులు వీధులే బట్టల షాపులు ఉన్నాయి. ఇక తరవాత చెప్పుకోవలసింది ఇక్కడి రెస్టారెంట్ల గురించి. అమెరికన్, మెక్సికన్, జపనీస్, చైనీస్, వియత్నమీస్, కాంటినెంటల్ ఇలా రకరకాల రుచులు దొరుకుతాయి. కేవలం పసందైన రుచుల కోసమే హలీయాన్‌కు వచ్చేవాళ్లు ఉన్నారట. ఆ రెస్టారెంట్లలో ఎంత సేపు కూర్చున్నా వెళ్లమని చెప్పరట. ఇక సావనీర్ షాపుల గురించి చెప్పక్కర్లేదు. అక్కడ కొందరు స్త్రీలు నా ముఖానికి ఉన్న బొట్టును చూసి ఇండియా అంటూ ప్రశ్నించారు. 'వియ్ లవ్ 'ఇండియా?' అని చెప్పడం ఒకింత గర్వంగా అన్పించింది. ఏనాడో సముద్ర దారుల్లో వియాత్నాం చేరిన మన అమరావతి ఘనకీర్తిని నేడు కళ్లారా చూడడం అనేది మాటల్లో చెప్పలేని వింతానుభూతి. మన తెలుగునేల మీదే కాదు వియాత్నాంలోనూ అమరావతి చెరగని ముద్రను వేసుకుందన్న ఆనందంలో హలీయాన్ ఆన్సియంట్ సిటీకి బైబై చెప్పేశాం. మరుసటి రోజు ఉదయం షాపింగ్ చేసుకున్నాం. వియాత్నాంలో కార్ల కంటే టూ వీలర్లు చాలా ఎక్కువ. టాక్సీ టూ వీలర్స్ కూడా ఉన్నాయి. వియాత్నాం సీఫుడ్‌కు, స్ట్రీట్ ఫుడ్‌కు ప్రసిద్ధిచెందింది. కాఫీ షాపులు ఎన్నో. ఇలా ఎన్నో వింతలను చూపించిన వియాత్నాం జ్ఞాపకాలను మూటకట్టుకుని ఆ సాయంత్రం విమానం ఎక్కేశాం.

**ఫోన్: 9010016555**



# ఏమో... కార్లు ఎగరావచ్చు!

**మహానగరాల్లో ట్రాఫిక్ పరిస్థితి మహాఘోరం. రద్దీ సమయాల్లో అయితే, అడుగడుగునా గండాలే. 'రెక్కల గుర్రం ఉంటే బాగుండు. హాయిగా ఎగిరి వెళ్లిపోవచ్చు' అనిపిస్తుంది ఎవరికైనా. ఆ ఆలోచన నుంచే 'రెక్కల కారు' పుట్టబోతోంది. రోడ్డు మీద భారీ ట్రాఫిక్ ఉందనుకుంటే... చిన్న మీట నొక్కితే సరిపోతుంది. క్షణాల్లో, కారు రెక్కలు విచ్చుకుంటాయి. రివ్వున ఆకాశమార్గంలో గమ్యానికి చేరుకోవచ్చు. అంతా అనుకున్నట్టు జరిగితే, ఓ రెండేళ్లలో 'ఫ్లయింగ్ క్యాబ్స్' అందుబాటులోకి వచ్చేస్తాయ్.**

మనిషి ఆలోచనలు భూమ్మీద నిలబడవు. అవకాశం దొరికితే చాలు, మేఘాలకు నిచ్చెన వేస్తాయి. ఆకాశంలో ఇంకేమైనా కొత్తగా చేయగలమా అని మెదడుకు నిరంతరం పదును పెడుతూనే ఉంటాడు మానవుడు. అందులోనూ ఆటోమొబైల్స్ రంగం మరింతగా దూసుకుపోతోంది. రోజురోజుకీ పెరుగుతున్న సాంకేతిక విజ్ఞానం, శక్తిమంతం అవుతున్న బ్యాటరీలు, తగ్గుతున్న ఎలక్ట్రానిక్ విడి భాగాల ధరలు... అన్నింటికన్నా ముఖ్యంగా పెరుగుతున్న అవసరాలు కొత్త ఆవిష్కరణలకు తావిస్తున్నాయి. ఇప్పుడు ఎన్నో సంస్థలు ఎగిరే కార్లపైనే తమ దృష్టంతా పెట్టాయి. రెండు మూడేళ్లలో ఆ కలను సాకారం చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నాయి.

**మూడు చక్రాలు...**

నెదర్లాండ్స్‌కు చెందిన 'పాల్ వి' సంస్థ మూడు చక్రాల ఎగిరే కారును డిజైన్ చేసింది. ఇది చూడడానికి స్పోర్ట్స్ కారులా ఉంటుంది. కారు వెనుక ఏరోడైనమిక్ తోక, రోటర్ బ్లేడ్లను అమర్చారు. గైరోప్లేన్‌లాగా ఇది ఎగరగలదు. వెనుకవైపు అమర్చిన రోటార్లు .... ఇంజిన్ వల్ల కాకుండా గాలి వేగానికే ఛార్జ్ అయి తిరుగుతాయి. గాలిలో ఎగిరేప్పుడు ఆ వాహనం గంటకు 160 నుంచి 180 కిలోమీటర్ల వేగాన్ని అందుకుంటుందని పాల్ వి సంస్థ ప్రతినిధులు చెబుతున్నారు. అయితే వాతావరణం, గాలి వీస్తున్న వేగం, గాలి సాంద్రతను బట్టి కారు ఎగిరే వేగం మారుతుంది. రోటార్లు గాలి వేగం వల్లే తిరుగుతాయి కాబట్టి... ఆకాశంలో ప్రయాణిస్తున్నప్పుడు హఠాత్తుగా ఇంజిన్ ఫెయిలైతే, కారుకి ప్రమాదం జరిగే ఆస్కారం ఉండదనీ, రోటార్ల సాయంతో బండి ముందుకు ప్రయాణిస్తుందనీ నిపుణులు చెబుతున్నారు. అంటే, ఇంజిన్ ఫెయిలైన కారు పారాచ్యూట్ లాగా జాగ్రత్తగా ల్యాండ్ అవుతుందన్నమాట. ఈ కారు ధర నాలుగు కోట్ల రూపాయల వరకూ ఉంటుంది. నిరంతరాయంగా 400 నుంచి 500 కిలోమీటర్ల దూరం ప్రయాణించగలదు. 100 లీటర్ల పెట్రోలును ఒకేసారి నింపుకోగలదు. దాదాపు 90 కార్లను తయారుచేసి ప్రపంచవ్యాప్తంగా అమ్మాలని ఆ సంస్థ భావిస్తోంది.

**మూడే నిమిషాల్లో..**

స్లొవేకియాకు చెందిన ఏరో మొబిల్ అనే సంస్థ కూడా ఫ్లయింగ్ కారు రూపకల్పనకు నడుం కట్టింది. 2020 కల్లా ఎలాగైనా ఎగిరే కారును మార్కెట్లోకి దించి తీరుతామని చెబుతోంది. రోడ్డుపైనా, గాలిలోనూ ప్రయాణించే కారును తాము తయారుచేయనున్నట్టు అధికారికంగా వెల్లడించింది కూడా. రోడ్డుపై వెళుతున్న కారును మూడంటే మూడే నిమిషాల్లో ఫ్లయింగ్ మోడ్ లోకి మార్చేయవచ్చు. మిగతా కంపెనీలతో పోలిస్తే... ఈ సంస్థ కాస్త దూకుడుగానే వ్యవహరిస్తోంది. త్వరలోనే ముందస్తు ఆర్డర్లు తీసుకుని 2020 కల్లా డెలివరీ చేస్తామనీ ప్రకటించింది. మొదటగా 500 కార్లను రూపొందించాలనీ ఆ తరువాత వచ్చే ఆర్డర్లను బట్టి నిర్ణయం తీసుకోవాలనీ భావిస్తోంది. ఈ కార్ల ధర ఎనిమిది కోట్ల రూపాయల పైమాటే. ఫ్రెంచ్ విమానయాన సంస్థ 'ఎయిర్ బస్' కూడా రహస్యంగా ఎగిరే కార్ల ప్రాజెక్టును చేపట్టింది. దానికి 'వాహన' అనే పేరును పెట్టింది. అందరినీ ఆశ్చర్యపరుస్తూ పారిస్‌లో జరిగిన ఎయిర్ షోలో తమ డిజైన్‌ను ప్రదర్శించింది. ఎయిర్ బస్ రెండు రకాలైన ఎగిరే కార్లను తయారు చేసే ఆలోచనలో ఉంది. ఒకటి, మనుషుల కోసం. రెండోది సరుకు రవాణా కోసం.

**గూగుల్ కూడా...**

గూగుల్ సహ వ్యవస్థాపకుడు లారీ పేజ్ ఎగిరే కార్లపై ఆసక్తి కనబరుస్తున్నట్లు వార్తలు వచ్చాయి. ఫ్లయింగ్ కార్లను తయారుచేయడానికి అవసరమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకొన్న ఓ రెండు చిన్న సంస్థలకు ఆయన ఇప్పటికే ఆర్థికపరమైన మద్దతు ప్రకటించారు. వంద మిలియన్ డాలర్ల పెట్టుబడి పెట్టేందుకు లారీ పేజ్ సిద్ధమైనట్టు వినికిడి. ఆ వార్తలను నిజం చేస్తూ పేజ్ ఇటీవల ఎగిరే డ్రోన్ లాంటి వాహనాన్ని ఆవిష్కరించారు. దీనిని పూర్తి స్థాయిలో కారు అనకపోయినా... ఎగిరే కారుకు మొదటి రూపంగా భావించవచ్చు. కాలిఫోర్నియాకు చెందిన కిట్టీహాక్ అనే సంస్థ దీన్ని రూపొందించింది. దీనికి 'కిట్టీహాక్ ఫ్లయర్' అని పేరు పెట్టింది. రెండు సిలిండర్లు, రెక్కలు, కూర్చోడానికి సీటు, స్టీరింగ్‌తో ఈ ఫ్లయర్‌ను డిజైన్ చేశారు. పై కప్పు ఏమీ ఉండదు. తొలి ప్రయోగాల్లో... 15 అడుగుల ఎత్తులో ఎగిరి చూపించారు కూడా. దీంతో, ఎగిరే కార్ల ఆవిష్కరణలో మొదటి అడుగు విజయవంతంగానే పడినట్టు చెప్పచ్చు.

జపాన్‌కు చెందిన ఆటోమొబైల్స్ సంస్థ టొయాటో కూడా ఎగిరే కార్లను తయారు చేసే పనిలో తలమునకలై ఉంది. 2020 టోక్యో ఒలింపిక్స్ నాటికి ఈ ఎగిరే కార్లను అందుబాటులోకి తేవాలని లక్ష్యంగా పెట్టుకుంది. సింగిల్ డ్రైవర్ కూర్చోవడానికి వీలుగా కారును సిద్ధం చేస్తున్నారు. తమ ఎగిరే కారులో ఒలింపిక్స్ టార్చ్‌ను సగౌరవంగా తీసుకెళ్లి ఆటల్ని ఆరంభించాలన్నది టొయాటో ఆలోచన. ఈ సంస్థ కార్టివేటర్ రిసోర్స్ మేనేజ్‌మెంట్ అనే చిన్న టెక్ కంపెనీతో కలిసి ఎగిరే కారు రూపకల్పనకు ప్రయత్నాలు చేస్తోంది. ఇందుకోసం టొయాటో నాలుగు లక్షల పౌండ్లను ఖర్చుపెడుతోంది.



ఒకటి రెండేళ్లలో... ఈ ప్రయోగాలన్నీ ఓ కొలిక్కి వచ్చే ఆస్కారం ఉంది. ఆ సమయానికి ఎటూ జనాభా పెరుగుతుంది కాబట్టి, భూమి మీద ట్రాఫిక్ తగ్గదు. బండ్లన్నీ పైనే వెళ్తుంటాయి కాబట్టి, ఆకాశంలోనూ జామ్‌లకు ఆస్కారం ఉంటుంది. మేఘాల మీద సిగ్నల్ లైట్లు బిగించాల్సిన పరిస్థితి వచ్చినా రావచ్చు.

**ఉబెర్ ప్రయత్నాలు...**

క్యాబ్‌ల బిజినెస్‌లో రాణిస్తున్న అమెరికా సంస్థ ఉబెర్ కూడా ఎగిరే కార్లపై కన్నేసింది. ఆ ప్రాజెక్టుకు 'ఉబెర్ ఎలివేట్' అని పేరు పెట్టింది. నగరాల్లో పెరిగిన రద్దీని క్యాష్ చేసుకోవాలన్నది ఉబెర్ ప్లాన్. అందుకే ఎలాగైనా 2020కల్లా ఎగిరే కార్లతో బిజినెస్ మొదలుపెట్టేయాలని ఉవ్విళ్లూరుతోంది. ఇప్పటికే ఎంబ్రియార్, బెల్ హెలీకాప్టర్లతో కలిసి ఫ్లయింగ్ కార్ల ప్రాజెక్టుకు శ్రీకారం చుట్టేసింది. గాలిలో... 20 కిలోమీటర్ల దూరాన్ని ఆరునిమిషాల్లో చేరేలా కార్లను డిజైన్ చేస్తోంది ఉబెర్. మొదటగా అమెరికాలోని డల్లాస్, దుబాయ్‌లలో ఎగిరే కార్లను పరీక్షించాలని భావిస్తోంది. ఇందులో పెట్రోలు, డీజిల్ వాడకుండా... పూర్తిగా విద్యుత్‌తోనే నడిపేలా పరిశోధనలు జరుగుగుతున్నాయి. దీని వల్ల పొగ కాలుష్యం ఉండదు. అలాగే విమానాలు, హెలికాప్టర్ల నుంచి వచ్చేలాంటి అధిక శబ్దాలూ ఉండవు. ఎగిరే కార్లను తయారు చేయడం ఒక ఎత్తయితే... భారత్ లాంటి దేశాల్లో వాటిని తిప్పేందుకు అనుమతులు తీసుకోవడం మరో ఎత్తు.

# అమెరికాలో... 'పాఠశాల'

**తెలుగునేలపైనే అమ్మభాష పట్ల మమకారం సన్నగిల్లుతున్న రోజులివి. అలాంటిది అమెరికాలో పుట్టి, పెరుగుతున్న పిల్లలకు ఉచితంగా తెలుగు నేర్పించాలన్న సంకల్పంతో 'పాఠశాల' పేరుతో మాతృభాషోద్యమానికి శ్రీకారం చుట్టారు ప్రవాస తెలుగు యువతి కొత్త జ్యోతిర్మయి. ఆ బడిలో రెండొందల యాభైమంది విద్యార్థులు అమ్మభాష మాధుర్యాన్ని ఆస్వాదిస్తున్నారు.**



**అ**మెరికాలో పుట్టి, అక్కడే పెరుగుతూ... నిన్నటివరకు ఇంగ్లీషు మాత్రమే తెలిసిన తొమ్మిదేళ్ల ఆదిత్య, తెలుగు మాత్రమే వచ్చిన నాన్నమ్మ, తాతయ్యలతో ధారాళంగా తెలుగులోనే సంభాషిస్తున్నాడు. అ,ఆలకు దూరంగా పెరుగుతున్న అనన్య తాను చదువుతున్న బడి గురించీ, తన స్నేహితుల గురించీ బోలెడన్ని విశేషాలతో అమ్మమ్మకూ, పిన్నీబాబాయ్‌లకూ ఉత్తరాలు రాస్తోంది. ఈ అక్షర విజయం వెనుక 'పాఠశాల' ఉంది. ఆ తెలుగుబడి వ్యవస్థాపకురాలు జ్యోతిర్మయి ఉన్నారు. ఏడేళ్ల క్రితం అమెరికాలోని షార్లెట్‌లో మొదలైన 'పాఠశాల' ఇప్పుడు నార్త్ కెరొలినా, కొలంబియా, ర్యాలీ నగరాలకూ విస్తరించింది.

### అలా మొదలైంది...

'ఇండియా నుంచి మా అమ్మానాన్నా వచ్చారు, వాళ్లని చూడటానికి రమ్మంటూ' జ్యోతిర్మయిని ఓ స్నేహితురాలు ఆహ్వానించారు. పనులన్నీ ముగించుకుని ఆమె ఇంటికి వెళ్లారు జ్యోతిర్మయి. అక్కడ, తరాల మధ్య అంతరం స్పష్టంగా కనిపించిందామెకు. మనవళ్లతో మనవరాళ్లతో బోలెడు కబుర్లు చెప్పుకోవచ్చని హుషారుగా విమానం ఎక్కిన ఆ పెద్దలు నెలతిరక్కుండానే తిరుగుముఖం పట్టాలని నిశ్చయించుకున్నారు. వెళ్తూవెళ్తూ 'అమ్మాయి, అబ్బాయి ఉద్యోగానికెళతారు. పిల్లలతో సరదాగా మాట్లాడదామంటే వాళ్ల భాష మాకు రాదు. మేం మాట్లాడుతున్నది వాళ్లకి అర్థం కాదు. ముద్దు చేద్దామని దగ్గరకు తీసుకోబోతే అస్సలు రారాయె! ఏదో పరాయివాళ్లను చూసినట్లు బిత్తర బిత్తరగా చూస్తుంటారు' అంటూ మనసులోని బాధను వ్యక్తం చేశారు. వృత్తి, ఉద్యోగాల కారణంగా దేశంకాని దేశమొచ్చినా... మనం అనుభవించిన ఆత్మీయతలూ అనుబంధాలూ మన పిల్లలకు కూడా అందించాలంటే భాషే ప్రధానం. అమెరికాలో పుట్టి పెరుగుతున్న మన పిల్లలకు తెలుగు నేర్పించాలన్న ఆలోచన అప్పుడే ఆమెలో అంకురించింది. భర్త రఘునాథ్ సహకారంతో 2009లో షార్లెట్‌లోని తమ ఇంట్లో 'పాఠశాల' పేరుతో తెలుగు బోధన కేంద్రాన్ని ప్రారంభించారు. తొలి ఏడాది ఆరు నుంచి పన్నెండేళ్లలోపు పిల్లలు పదిహేనుమంది దాకా చేరారు. వారిలో చాలామందికి అక్షరమాల అసలే తెలియదు. అందరితో అ,ఆలు దిద్దించడం మొదలుపెట్టారు జ్యోతిర్మయి. మరుసటి ఏడాది విద్యార్థుల సంఖ్య రెట్టింపు అయింది.

### ప్రతి ఆరుగురికి...

"మా ప్రయత్నం చూసి మంజుల సూరే, తమ్మారావు కదిరిసెట్టి, రాధా వేలూరి, నీలిమ దేవినేని, అనూరాధ కింతలి వంటి కొందరు మిత్రులు కలిసి ప్రయాణించేందుకు ముందుకొచ్చారు. షార్లెట్‌లో ఉన్న తెలుగువారితో సమావేశమై... పిల్లలు తెలుగు ఎందుకు నేర్చుకోవాలో వివరిస్తూ అవగాహన కార్యక్రమాలు నిర్వహించాం. ఆ కృషి ఫలించింది. అంతా ఆసక్తి చూపారు. దూరప్రాంతాల్లో ఉన్న వారి రాకపోకలకు ఇబ్బంది కలగకుండా, నైబర్‌హుడ్ స్కూలింగ్ విధానంతో కమ్యూనిటీ కేంద్రాలను ప్రారంభించాం. అంటే, ఎక్కడికక్కడ కేంద్రాన్ని నిర్వహిస్తున్నాం. ఆ కాసేపూ స్థానికుల నివాసాలే పాఠశాలలు అవుతాయి. ప్రతి ఆరుగురు విద్యార్థులకూ ఒక ఉపాధ్యాయులు ఉంటారు. అంతా తెలుగు భాషపట్ల అభిమానం కలవారే, తెలుగు బోధించడాన్ని ఇష్టపడుతున్నవారే. వారికి బోధనపై శిక్షణ ఇచ్చాం. దాదాపు నలభైమంది ఉచితంగా సేవలను అందిస్తున్నారు. మరో పన్నెండు మంది కార్యకర్తలు కూడా ఉన్నారు. ప్రతి శనివారం రెండు మూడు గంటలు తరగతులు జరుగుతాయి. ఆ సమయంలోనే విద్యార్థులకు నాలుగు రోజులకు సరిపడా ఇంటి పని ఇస్తారు" అంటూ బోధన విధానాన్ని వివరించారు జ్యోతిర్మయి.

### ప్రత్యేక సిలబస్...

పాఠశాలలో పిల్లల నుంచి ఎలాంటి ఫీజూ వసూలుచేయరు. విరాళాలు తీసుకోరు. పాఠ్య ప్రణాళిక కూడా సొంతంగా తయారు చేసుకున్నదే. అందులో అ, ఆల దగ్గర నుంచి వేమన పద్యాలు, సుమతీ శతకం, పెద్దబాల శిక్ష, పంచతంత్ర, పేదరాసి పెద్దమ్మ, బాలమిత్ర, చందమామ కథలు, భారత్ లోని పర్యాటక ప్రదేశాలు వంటి అంశాలు బోధిస్తున్నారు. ఏటా విద్యార్థులకు వార్షిక పరీక్షలు నిర్వహించి, ఉత్తీర్ణులైనవారందరికీ ప్రశంసాపత్రాలు అందజేస్తున్నారు. పిల్లలు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు అంతా కలిసి ఉపాధ్యాయ దినోత్సవం, ఉగాది వంటి పండుగలను వేడుకగా జరుపుకుంటారు. 'ఇదివరకు ఇండియా వెళితే, వేరే దేశానికి వెళ్లినట్లు అనిపించేది. తెలుగు నేర్చుకున్న తర్వాతే నా దేశానికి వచ్చానన్న అనుభూతి కలిగింది' అంటూ ఓ చిన్నారి వార్షికోత్సవ సభలో సంబరంగా చెప్పింది. 'పాఠశాల' లక్ష్యమూ అదే.

**- కురసాల వెంకటేష్**





**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych),
P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ
ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి

# మైగ్రేన్ తలనొప్పి మళ్లీ రాలేదు

22 ఏళ్ల శశిరేఖ ఒక ప్రముఖ కంపెనీలో ఉద్యోగం చేస్తోంది. ఐదంకెల జీతం. కానీ ఆమె ఉద్యోగం కోల్పోయే పరిస్థితి వచ్చింది. కారణం ఆమె సెలవులు ఎక్కువగా పెడుతుండటమే. నెలలో 10 రోజులు సెలవుపెడితే ఏ కంపెనీ మాత్రం ఉంచుకుంటుంది. అయితే అన్ని రోజులు సెలవులు పెట్టడానికి కారణం మైగ్రేన్. ఆమె తీవ్రమైన మైగ్రేన్ సమస్యతో బాధపడుతోంది. తలనొప్పి లేచినపుడు మూడు నాలుగు రోజుల పాటు గదికే పరిమితమవుతుంది. కళ్లు తెరిచి వెలుతురు చూడాలన్నా భయం. తలనొప్పి మాత్రలు ఎన్ని వేసినా ఫలితం శూన్యం. మెదడులో ఏదైనా సమస్యేమో అనుకుని స్కానింగ్ తీయించడం, ప్రముఖ వైద్యులకు చూపించడం జరిగింది. కానీ ఆమె తలనొప్పి మాత్రం తగ్గలేదు. నెలలో రెండు, మూడు సార్లు ఈ తలనొప్పి ఆమెను వేధిస్తోంది. తలనొప్పి వచ్చినపుడల్లా ఆఫీసుకు లీవుపెట్టడం జరుగుతోంది. ఈ సమయంలోనే ఆమెకు హోమియో చికిత్స గురించి తెలిసింది. మైగ్రేన్‌కు హోమియో మాత్రమే పరిష్కారం చూపుతుందని తెలియడంతో పరుగుపరుగున మా క్లినిక్‌కు వచ్చింది.

## హోమియో చికిత్స తరువాత

మైగ్రేన్ సమస్యకు ఇతర చికిత్సా విధానాల్లో పరిష్కారం లేదనే చెప్పవచ్చు. ఇతర చికిత్సల్లో లక్షణాలు తగ్గించేందుకు చికిత్స ఇస్తారే తప్ప మూలకారణాన్ని తొలగించేలా చికిత్స ఉండదు. నొప్పి నివారణ మాత్రలతో తలనొప్పి తాత్కాలికంగా తగ్గుతుందే తప్ప పూర్తిగా పోదు. నాలుగు రోజుల తరువాత మళ్లీ మామూలే అవుతుంది. కానీ హోమియో చికిత్స అలా కాదు. మూలకారణాన్ని తొలగిస్తుంది. మైగ్రేన్‌కు కారణమవుతున్న నరాలను సాధారణ స్థితికి తీసుకువస్తుంది. కెమికల్స్ విడుదలను అడ్డుకుంటుంది. ఫలితంగా మైగ్రేన్ సమస్య శాశ్వతంగా తగ్గిపోతుంది. సమస్య మళ్లీ పునరావృతం కావడం అంటూ ఉండదు. ఈ చికిత్సలో ఎలాంటి సైడ్ఎఫెక్ట్స్ కూడా ఉండవు. శశిరేఖకు కూడా ఈ విధంగానే చికిత్స అందించడం జరిగింది. ఇప్పుడామె తలనొప్పి సమస్య పూర్తిగా తొలగిపోయింది. ఇప్పుడు ఎంతో ప్రశాంతంగా ఉందని, ఊరటగా ఉందని ఆమె చెప్పుకొచ్చింది. ఇప్పుడావిడ సంతోషంగా, ఎటువంటి సెలవులు పెట్టకుండా ఉద్యోగం చేసుకుంటోంది.

# హెపటైటిస్ బాధ ఇలా పోయింది

అతని పేరు దివాకర్. వయస్సు 32 సంవత్సరాలు. ఆరోగ్యంగా, దృఢంగా ఉండేవాడు. కానీ కొన్ని నెలల క్రితం సాధారణ లక్షణాలతో ఒక సమస్య మొదలయ్యింది. మరికొన్ని రోజులు అలస్యమైతే ప్రాణాలు కూడా పోయేవి. ఇంతకీ అతనికి అనారోగ్య లక్షణాలు ఎలా మొదలయ్యాయంటే... ప్రారంభంలో నీరసంగా ఉండటం, ఆకలి లేకపోవడం, ఆకలిగా అనిపించినా తినాలని అనిపించకపోయేది. తింటే వాంతులు అయ్యేవి. కొన్ని రోజులకు కడుపు నొప్పి కూడా మొదలయింది. ఊర్లో తెలిసిన డాక్టర్‌కు చూపిస్తే ఏవో మందులు రాసిచ్చాడు. వారం రోజులు వాడినా కొద్దిగా కూడా ఫలితం లభించలేదు. ఈలోగా కళ్లు పసుపు రంగులోకి మారుతున్నాయన్న విషయాన్ని స్నేహితులు, కుటుంబసభ్యులు గమనించి చెప్పారు. ఇక ఆలస్యం చేయడం మంచిది కాదని దగ్గరలో ఉన్న టౌన్‌కి వెళ్లి డాక్టర్‌కు చూపించాడు. అక్కడ పరీక్షలన్నీ చేసి హెపటైటిస్ వైరస్ సోకిందని, కామెర్లు వచ్చాయని చెప్పారు. దాంతో దివాకర్‌కి ఒక్కసారిగా పాతాళంలో కూరుకుపోయినట్టిగా అనిపించింది. హెపటైటిస్ వైరస్ ప్రాణాంతకం అని, కాలేయం పాడయిపోతుందని చెప్పేసరికి అతనిలో ఆందోళన మరింత రెట్టింపు అయింది. కాలేయ వ్యాధులతో చనిపోతున్న వారి వార్తలు రోజు వింటూనే ఉన్నాడు కాబట్టి ఏం చేయాలో పాలుపోలేదు. ఆ సమయంలోనే తెలిసిన మిత్రుడు ఒకడు హోమియో చికిత్స గురించి చెప్పాడు. అల్లోపతిలో నయం కాని ఎన్నో జబ్బులకు హోమియో మందులతో మంచి ఫలితం లభిస్తుందని, ముఖ్యంగా హెపటైటిస్ వైరస్‌ను కట్టడి చేసే మందులు హోమియోలో ఉన్నాయని చెప్పాడు. దాంతో పరిగెత్తుకుంటూ మాదగ్గరకు వచ్చాడు.

## సందేహాలు తీర్చాం

మాదగ్గరకు వచ్చినపుడు అతనిలో ఎన్నో సందేహాలు. వచ్చీ రాగానే తన సందేహాలన్నింటిని మా ముందుంచాడు. చికిత్స కన్నా ముందు అతని సందేహాలన్నీ తీర్చే ప్రయత్నం చేశాం. కొన్ని వ్యాధుల్లో లక్షణాలు వెంటనే బయటపడతాయి. మరి కొన్ని వ్యాధుల్లో ఏళ్ల తరువాత లక్షణాలు బయటపడతాయి. హెపటైటిస్ వైరస్ విషయంలోనూ అంతే. శరీరంలోకి ప్రవేశించిన తరువాత కొన్నేళ్ల పాటు నిద్రాణంగా ఉండిపోతుంది. సమయం చూసి దాడి చేస్తుంది. వైరస్ శరీరంలో ప్రవేశించినపుడు కాలేయంలో కొన్ని రకాల మార్పులు చోటుచేసుకుంటాయి. దీర్ఘకాలంలో లక్షణాలు బయటపడతాయి అనగానే ఈ వైరస్ నా శరీరంలో చాలా కాలం క్రితమే ప్రవేశించి ఉంటుందా? అనే ప్రశ్న అడిగాడు. అవును అనగానే ఎలా ప్రవేశించి ఉంటుందని మరో సందేహాన్ని అడిగాడు. అప్పుడు అతని సందేహానికి సమాధానంగా రక్తమార్పిడి ద్వారా, శృంగారం ద్వారా, వెజైనల్ ఫ్లూయిడ్ ద్వారా హెపటైటిస్ బి వైరస్ ఇతరులకు వ్యాప్తి చెందుతుందని చెప్పాం. లాలాజలం, తల్లిపాల ద్వారా, సురక్షితం కాని నీడిల్స్, సిరంజిలు ఉపయోగించడం వల్ల వచ్చే అవకాశం ఉందని వివరించాం. డ్రగ్స్, పచ్చబొట్టు, ఒకరు ఉపయోగించిన బ్లేడ్‌ను, టూత్‌బ్రష్‌ను వాడటం వల్ల హెపటైటిస్ రావచ్చని చెప్పాం. కారణం ఏదైనా భయపడాల్సిన పనిలేదని హోమియో వైద్యుల సలహా మేరకు మందులు వాడుతూ, ఆరోగ్యకరమైన జీవనం సాగించడం, పరిశుభ్రమైన ఆహారం, తగినంత విశ్రాంతి తీసుకోవడం చేస్తే ఇట్టే నయమవుతుందని చెప్పాం. వెంటనే అతను చికిత్సకు ఒప్పుకున్నాడు.

## చికిత్స తరువాత

అతని శారీరక, మానసిక లక్షణాలను పరిశీలించి చికిత్స ప్రారంభించాం. హోమియో మందులతో త్వరగా కోలుకుంటావని, ఏమాత్రం భయపడాల్సిన అవసరం లేదని ధైర్యం చెప్పాం. అతను మా ఆసుపత్రికి వచ్చినపుడు తీవ్రమైన కడుపు నొప్పితో బాధపడుతున్నాడు. ఆహారం ఏమాత్రం తీసుకోవడం లేదు. కళ్లు బాగా పచ్చగా ఉన్నాయి. వికారం, వాంతులు అవుతున్నాయి. హోమియో చికిత్స మొదలు పెట్టాక వారం రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. వికారం తగ్గింది. ఆకలి పెరిగింది. మామూలుగా ఆహారం తీసుకోవడం మొదలుపెట్టాడు. నెల రోజుల తరువాత రివ్యూకు వచ్చినపుడు అతనిలో చాలా మార్పు కనిపించింది. వైరల్ లోడ్ తెలుసుకునేందుకు పరీక్ష చేయిస్తే అతి తక్కువ స్థాయిలో ఉన్నట్లుగా తేలింది. ఆ విషయం అతనికి చెప్పడంతో అతను చాలా సంతోషం వ్యక్తం చేశాడు. జీవితం ముగిసిపోతుందన్న దశలో హోమియో చికిత్స ప్రాణాలు నిలిపిందని కృతజ్ఞతలు చెప్పాడు.

**మాస్టర్స్ హోమియోపతి**
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106

V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి
డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.

ADVT

# జోగారావు దయచేతను

చింతకింది శ్రీనివాసరావు



వీరవిల్లి జోగారావు భగత్‌సింగ్ కాదు. దేశం కోసం బాంబులు పేల్చలేదు. అల్లూరి సీతారామరాజు కానేకాదు. కొండప్రజ కోసం కత్తిపట్టలేదు. మహాత్మాగాంధీయో, నేతాజీ సుభాష్ చంద్రబోసో, చంద్రశేఖర్ అజాదో అస్సలు కాదు. జాతి కోసం నానా యాతనా పడలేదు. కాబట్టే వాడి గురించి మీకేం తెలీదు. అది మీ తప్పు కాదు. బేసబూ అంతకన్నా కాదు. మరంచేతే వాడి వ్యవహారం నాకుగా నేనే ఈవేళ మీకు చెప్పాలనుకుంటున్నాను.

మా జోగారావు అర్జనగిరి గ్రామ మునసబు దోర్బా వెంకటేశ్వర్లుగారి బావమరిది. విజయనగరం జిల్లా కొండవెలగాడలోనో, బూరాడపేటలోనో ఉంటూ ఉంటాడు. ఏణ్ణర్ధం కోమారు మటుకు విశాపట్నం జిల్లాలోని చోడవరం పట్టణం సమీపాన ఉండే అర్జనగిరి మీద పడతాడు.



వాడొకసారి అర్జనగిరి వేంచేసి ఏం చేశాడనుకున్నారు? ఊరి రైత్వారీ జనావళిని కదలదీశాడు. తరచూ గ్రామాన్ని నాశనం చేస్తున్న కరువులకీ కాటకాలకీ మూలం భక్తి లేమి మాత్రమేనని నమ్మబలికాడు. పంటలు పండకపోవడానికి ఇదే ప్రధాన హేతువనీ గాఠ్ఠిగా చెప్పేశాడు. చెప్పడమే కాదు. అందుమీదట అందరితోనూ వాదించాడు. తన వాదననే సర్వుల హృదయాల్లోనూ స్థిరం చేసేశాడు. పాటకపు జనం వాడి మాటలు నమ్మారు. తరుణోపాయం చెప్పమని బతిమాలారు. తిరుపతి యాత్రచేస్తే కష్టాలన్నీ పోతాయని వీడన్నాడు. మాకు తిరుమల దారి తెలియదని వాళ్లంతా వగచారు. తనున్నదే పదిమందికీ దారి చూపించడానికేనని వీడు కూసాడు.

వాళ్లంతా వీడి మాట నమ్మారు. ఊరి షావుకార్లకి ఉన్న సరుకూ సప్పరా అప్పగించేసి పదో పరకో పుచ్చుకుని పిల్లాపాపల్తో పయనమయ్యారు.

సరిగ్గా జోగారావు పెట్టిన సాయంకాలం ముహూర్తానికే అందరూ సంచులూ గించులూ సర్దుకుని రెండు కోసుల దూరం నడుచుకుంటూ చోడవరం బస్సులస్టాండుకి వచ్చిపడ్డారు. ఆ వెంటనే వారిదగ్గరున్న నగదు మొత్తాన్నీ ఒక కాగితం మీద రాస్తున్నట్టు రాసి తీసేసుకున్నాడు జోగారావు. ఎవరి దగ్గర డబ్బున్నా రైల్లో దొంగలు మొత్తుతారని, తన జేబులో ఉంటే మహరాజు కొండలా లక్ష్మీదేవి స్థిరంగా ఉంటుందని తెలియజెప్పాడు. ఆ మాటలమీద విశ్వాసంతోనూ తిరుమల వెంకన్నమీద నమ్మకంతోనూ రైతులందరూ షావుకార్ల నుంచి తెచ్చుకున్న సొమ్మంతా ఈయన గారి ఎదాన కొట్టారు. రైతుల భార్యలు కొందరు మటుకు, "మొత్తవంతా ఆ బావుకిచ్చేత్తే మనకాడేటుంటాది. బొచ్చూ బొబ్బరగడ్డీని. ఎంకటేస్పరుని పటం కొన్నానికీ డబ్బునేపోతే ఇకనెందుకు మన యాతర" గట్టిగానే అన్నారు. కానీ, జోగారావు నీతి నిజాయితీలు ఎనలేనివని విశ్వసించిన పలువురు పురుషపుంగవులు వాళ్లకు పుచ్చుదొబ్బులు పెట్టారు. ప్రశ్నించే నోళ్లను ఆ రకంగా విజయవంతంగా మూయించగలిగారు. ఆనక వారి యాత్ర మొదలైంది.

• • •

ముందుగా ఉషా ప్రయివేటు బస్సు తొలి సీట్లో జోగారావు ఆయన భార్య కనకలక్ష్మి కూర్చున్నారు. మిగిలిన సీట్లలో ఏభైమంది వరకూ అర్జనగిరి యాత్రికులు కుదురుకున్నారు. అందరూ 'గోవిందా గోవిందా' అంటూ నోరు సాగ్గొట్టుకుని తీవ్రమైన స్వరంతో స్వామి నామస్మరణ చేస్తుండగా బస్సు బయలుదేరింది. అరగంటలోనే అనకాపల్లిలో వీళ్లని దింపేసింది.

తాము మాత్రమే రిక్షా కుదుర్చుకున్నారు జోగారావు దంపతులు. మిగిలినవారిని తమ వెనుక నడిచి రమ్మనమని ప్రేమగా చెప్పారు. తట్టలు బుట్టలు నెత్తిమీద మోపుకుని, పిల్లాపాపల్ని చంకల్లోకి లాక్కుని, యాత్రికులందరూ గోవిందలు కొట్టుకుంటూ అనకాపల్లి కోపరెటివ్ బ్యాంకు రోడ్డు నుంచీ చచ్చీచెడీ రైల్వేస్టేషన్‌వరకూ నడుచుకుని వెళ్లారు. ప్లాట్‌ఫామ్ మీదికి చేరారు. వాళ్ల చేతుల్లో ఆర్డనరీ టికెట్లు తెచ్చిపడేశాడు జోగా రావు. ఈలోగా రైలు రానే వచ్చింది. అందరినీ కిటకిటలాడుతున్న జనరల్ బోగిలోకి సామాన్లతో సహా బలవంతంగా తోసేశాక జోగారావు దంపతులు మరో రెండు కంపార్టుమెంట్లకు ఆవలనున్న చలిమర బోగిలోకి వెళ్లారు. తమ వెంట తెచ్చుకున్న దధ్యోజనం, పులిహోర, చక్రపొంగలి పొట్లాలను ఏసీ బోగీలో హాయిగా విప్పుకుని కడుపారా తిన్నారు. బ్రేవ్‌మని త్రేన్చారు. ఎంగిలి అరిటాకులను పారేసి స్థిమితపడ్డారు. వేడి

## సరదా కథ

కాఫీ వస్తే కొనుక్కుని చప్పరించుకుంటూ తాగారు. కులసాగా కాసేపు కబుర్లాడుకుని ఆ తర్వాత బెర్తుల్ని కరుచుకుని విశ్రమించారు.

ఉదయం ఏడింటి ప్రాంతాన రేణిగుంట వచ్చేసింది. నిండుగర్భిణిలా అప్పటివరకూ కదిలిన రైల్లోంచి తిరుపతి భక్తులందరూ దిగిపోవడంతో పురుడయిన పచ్చిబాలింతలా నీరసంగా మారిపోయింది ఆ రైలు. అర్జనగిరి యాత్రికులు బిలబిలమంటూ జోగారావు చుట్టూ చేరిపోయారు. కొత్త ప్రాంతానికి తీసుకువచ్చి తమకు ఆ మహానుభావుడు ఎంతో మేలు చేశాడన్నట్టుగా మురిసిపోయారు.

రేణిగుంట స్టేషన్‌లోనే స్నానపానాలు కానిచ్చిన అర్జనగిరి మందను ఖాళీ తొట్టె వ్యాన్‌లో ఎక్కించి కబేళాకు తోలుకెళ్లే పశువుల మాదిరిగా జోగారావు దంపతులు తిరుపతికి తెచ్చిపడేశారు. తాము మాత్రం తీరుగా టెంపోలో వచ్చారు. కొండమీదికి నడిచి రమ్మనమని అందరికీ సలహా ఇచ్చేసి వడివడిగా అదే టెంపోలో ఏడుకొండలవాడి సన్నిధికి వారిద్దరూ చేరిపోయారు.

నడిచి కొండలెక్కలేమని, చుక్కల పర్వతం ఎక్కితే చుక్కలు కనిపిస్తాయని, మోకాలి పర్వతం ఎక్కితే మోకాళ్లు పనిచేయవని మందలో కొందరు ముసలిముద్దలు మొత్తుకున్నారు. తోటి మహిళలు మరికొందరు వాళ్లమీద కోప్పడ్డారు. పుణ్యం రావాలంటే త్యాగం చేయాలన్నట్టుగా ఏదేదో చెప్పి వాళ్లను ఈడ్చుకుపోయారు. ఇంకా చెప్పాలంటే పేదల త్యాగాలనే దేశమాత కోరుతోందన్నట్టుగా తెలిసీ తెలియనిదంతా వాగారు. ఆ విధంగా ఉదయం పదింటికి అలిపిరి నుంచి మొదలయిన వారి నడక సాయంత్రానికి గానీ పూర్తికాలేదు. వాళ్ల దగ్గర ఎర్రటి ఏగాణీ లేదు. తంతే దమ్మిడీ లేదు. నీరసపడి ఏ కూల్‌డ్రింకో, మజ్జిగో తాగుదామన్నా అయివేజు లేదు. మెట్ల దారిలో భక్తులెవరో చేస్తున్న నారాయణసేవలో దూరి గొంతులు కాస్తంతగా తడుపుకున్నారు. అక్కడ కొండమీద మటుకు జోగారావు జంట సరయిన దేవస్థానం గదొకటి తీసుకుని, స్నానాలు చేసి, పెద్ద టిక్కెట్టు మీద దైవదర్శనం చేసుకుని, సప్తగిరి భోజనాలయంలో కడుపు బద్దలయ్యేలా ఫుల్‌మీల్స్ లాగించి తొంగున్నారు.

అర్జనగిరి భక్తులు చీకటి పడుతుండగా కొండమీదికి చేరారు. నీరసంగా ఉందని, చచ్చీలా ఉన్నామని చెప్పినా వినకుండా వాళ్లని కల్యాణకట్టకి బయలుదేరదీశాడు జోగారావు. ఆడామగా తేడా లేకుండా అందరికీ గుళ్లు గొరిగించాడు. నిజానికి, చోడవరం బస్టాండులో ఎప్పుడయితే వాళ్లందరి డబ్బూ తన జేబులోకి చేరిందో అప్పుడే తొలిమాటు జోగారావు వీళ్లకి గుండు చేసినట్టు. ఇప్పుడు చేయించిన గుండు రెండో గుండు. అనగా ద్వితీయ క్షవరకల్యాణమన్నమాట. మొదటి గుండు ఎవరికీ కనబడదు. రెండో గుండు అందరికీ కానవస్తుంది. అంతే తేడా. ఇకను గొరుగుడంతా పూర్తయ్యాక జనాలందరికీ మజ్జిగన్నం పొట్లాలు ఎక్కణ్నించో తెచ్చిపడేసింది కనకలక్ష్మి. కనకం కరక్టుగా జోగుడికి తగిన జోడీ. గంతకి తగిన బొంత. గజ్జికి తగిన గిలిగింత.

మజ్జిగన్నమో, పెరుగన్నమో నాలుగు మెతుకులు దొరికాయి అదే చాలును.. అనే సిద్ధాంతంతో ఇచ్చిన పొట్లాలు ఇచ్చినట్టుగానే తినేసి కుళాయిలదగ్గర చేతులు కడుక్కుని ఇన్ని నీళ్లు తాగింది అర్జనగిరి బృందం. కాళ్ల నొప్పులు పుడుతుండగా కోవెల ఎదురుగా ఒక చెట్టు చూసుకుని దానికిందే పడుంది. చెప్పవలసిన జాగ్రత్తలన్నీ చెప్పి జోగారావు సతీసమేతుడై గదికి పోయాడు.

తెల్లవారుఝామున మూడింటికే ఈ దంపతులిద్దరూ శుచిర్భూతులయ్యారు. తలారాస్నానం చేశారు. తిరుమలేశునికి


ఆడామగా తేడా లేకుండా అందరికీ గుళ్లు గొరిగించాడు. నిజానికి, చోడవరం బస్టాండులో ఎప్పుడయితే వాళ్లందరి డబ్బూ తన జేబులోకి చేరిందో అప్పుడే తొలిమాటు జోగారావు వీళ్లకి గుండు చేసినట్టు. ఇప్పుడు చేయించిన గుండు రెండో గుండు. అనగా ద్వితీయ క్షవరకల్యాణమన్నమాట. మొదటి గుండు ఎవరికీ కనబడదు. రెండో గుండు అందరికీ కానవస్తుంది. అంతే తేడా.


నమస్సులు చెల్లించుకున్నారు. ప్రత్యేకదర్శనం టిక్కెట్లు పట్టుకున్నారు. మారుదర్శనం మహాఘనం కదూ! అందుకనే రెండవసారి ఆ మంగపతిని కనులారా కాంచేందుకు వసతి నుంచి బయటపడ్డారు. సరాసరి చెట్టుకిందికే వెళ్లారు. అందర్నీ హడావుడిగా లేపి వాళ్లల్లో ఒకణ్ని తీసుకుని వాడికి సర్వదర్శనం క్యూ లైను చూపించారు. స్నానాలు గట్రా ఉచిత ఘట్టాల్లో కానిచ్చేసి ఆ క్యూలో నిలబడితే బాలాజీ దర్శనం బహు బాగా అయిపోతుందని చెప్పి తప్పుకున్నారు. వాళ్లు మాత్రం స్పెషల్ దర్శనం క్యూలో చేరిపోయారు.

వేంకటేశ్వరస్వామి కలియుగదైవం. పిలిస్తే పలికే దేవుడు. భక్తుల పాలిట కొంగుబంగారం. ఆయనకు అందరూ సమానం. కొందరు మటుకు అసమానం. అదే వచ్చిన చిక్కు. ఏది ఎలాగయితేనేం, స్పెషల్‌కోటా కింద కాళ్లు కదిపిన జోగారావు జంటను రెండు గంటల్లోనే ఆ శేషాద్రివాసుడు కరుణించాడు. దర్శనమిచ్చేశాడు. సర్వదర్శనం క్యూలైన్లో నిలుచున్న అర్జనగిరి బృందానికేమో పదకొండు గంటలపాటు కాళ్లపీకులు పెట్టించి ఆనక ముఖం చూపించాడు. తాను పేదల భక్తినే ఎక్కువగా పరీక్షిస్తానన్న సందేశమేదో ఇవ్వకనే ఇచ్చాడు. కాళ్లు రోళ్లయినా దైవదర్శనం అయిందంతే చాలునని బృందసభ్యులు భేష్ అనుకున్నారు.

వీళ్లు ఇలా అనుకుంటున్న సమయంలోనే జోగారావు, కనకలక్ష్మి గది ఖాళీ చేసేసి నిక్షేపం లాంటి అద్దె కార్లో ఎవరికీ చెప్పాపెట్టకుండా గబగబా కొండదిగేశారు.

"గుండు కొట్టించాం.. దర్శనం చేయించాం. ఇంక అర్జనగిరి రైత్వారీతో మనకేం పని.." అన్నట్టుగా మంగాపట్నం వెళ్లి అమ్మవారిని సేవించుకున్నారు. ఆ మీదట రేణిగుంట జారుకుని దొరికిన ట్రయినెక్కి విశాఖవైపు ఝామ్మంటూ దూసుకుపోయారు. అర్జనగిరివాసులు తమకిచ్చిన డబ్బు ఇంకా



ఎంత మిగిలిందో దారి మధ్యన లెక్కవేసుకుంటూ 'చలోభాయ్.. చేతిలో రొట్టె..' అనుకుంటూ మట్టసంగా బూరడపేటకు లగాయించారు.

• • •

ఈ సంగతి తెలియని కొండమీది అర్జనగిరి దెష్టలు లజ్జుగుజ్జులు పడిపోయారు. జోగారావు ఎక్కడున్నాడో, కనకమ్మ ఎక్కడికెళ్లిందో తెలియక మల్లగుల్లాలూ పడ్డారు.

"ఆ బావు సంగతి మాకు తెల్దేటి. పెదాల మీద పప్పలొండగల్డు. డబ్బియ్యకండర్రా అంటే మామీదే నిగిణ్నారు. మాం సెప్పింది ఇన్నారేటి?" ఆడవాళ్లు కొందరు దీర్ఘాలు తీయగా చిన్నబుచ్చుకున్న మరికొందరు మగాళ్లు వాళ్లతో గుద్దులాటకు దిగారు.

కాసేపు ఇలా రుంజుకున్నాక కొండంతా తిరగడం మొదలెట్టారు. కనిపించిన ప్రతీవాణ్నీ పట్టుకుని,

"ఎర్రగా ఎత్తుగా ఉండీ మా జోగారావు బాబయ్యని తవరు సూసినారేటి. సూసినారేటి.." అంటూ అడగడం

మొదలెట్టారు. కొందరు చూళ్లేదన్నారు. మరికొందరు అలాంటి వ్యక్తితో తమకు పరిచయం లేదన్నట్టుగా మాట్లాడేరు. "మా ఊరివాళ్లంతా ఎర్రగా ఎత్తుగానే ఉంటారోయ్ ..." అని వేళాకోళమూ చేశారు. ఒకటికి పదిసార్లు ఇదే భోగట్టా తమను అడుగుతున్నారన్న కోపంతో ఒకరిద్దరు మాత్రం,

"పఫైస్. జోగారావెవడో మాకేటి తెలుసును. మమ్మల్ని దొబ్బుతున్నారు" మాదిరిగా కొండమీద కూడా బండభాషలో తిట్లు తిట్టారు.

చేసేది లేక, జోగారావు దొరకడని నిర్ణయించుకున్నాక, అర్జనగిరి రైతులందరూ దేవుడి గిరిమీదనే పావలా బేడా అడుక్కోవడం మొదలెట్టారు. మనదేశంలో రైతులు అడుక్కోవడం చిత్రమేమీ కాదు. వాళ్లు పుట్టిందే ముష్టికోసమన్న భోగట్టా అందరికీ తెలిసిందే. కాబట్టే కొండమీది భక్తులెందరో పెద్దగా ఈ సంగతిని పట్టించుకోలేదు. 'రైతు దేశానికి వెన్నెముక..' అని భావించేవారు అక్కడక్కడయినా తగలడి ఛస్తారు గనుక తోచిన సాయమేదో చేశారు. ఆ సాయంతోనే ఏదేదో కొనుక్కుని ఏడుపు ముఖాలతో వీళ్ల ఆకళ్లు తీర్చుకున్నారు. మరో ధర్మాత్ముడెవరో సహకరించగా కొండదిగి తిరుపతిలో పడగలిగారు.

అందరూ దిగువ తిరుపతికి దిగారు సరే. రేణిగుంట వెళ్లాలి కదా. రైలుపట్టుకోవాలి కదా. అనకాపల్లి చేరాలి కదా. బస్సెక్కాలి కదా. చోడవరంలో పడాలి కదా. ఇదంతా మామూలు కథ కాదు కదా. ఇందుకు డబ్బుండాలి కదా.. ఆలోచించగా ఆలోచించగా స్వీయ జ్ఞాన సముపార్జనే ఉత్తమమన్న మహావిజ్ఞానాన్ని పొందేశారు. వాళ్లదగ్గర ఏముందో వాళ్లే తెలుసుకోవడం

అర్జనగిరి రైతులందరూ దేవుడి గిరిమీదనే పావలా బేడా అడుక్కోవడం మొదలెట్టారు. మనదేశంలో రైతులు అడుక్కోవడం చిత్రమేమీ కాదు. వాళ్లు పుట్టిందే ముష్టికోసమన్న భోగట్టా అందరికీ తెలిసిందే. కాబట్టే కొండమీది భక్తులెందరో పెద్దగా ఈ సంగతిని పట్టించుకోలేదు. 'రైతు దేశానికి వెన్నెముక..' అని భావించేవారు అక్కడక్కడయినా తగలడి ఛస్తారు గనుక తోచిన సాయమేదో చేశారు.

మొదలెట్టేశారు. దీనినే ఆంగ్లంలో ఉజ్జాయింపుగా "నెసిసిటీ ఈజ్ ద మదర్ ఆఫ్ ఇన్వెన్షన్" అంటారేమో. తెలుగులోకి స్థూలంగా దీన్ని అనువాదం చేసి చెప్పాలంటే "అవసరమే మనిషిని అడుక్కోనిచ్చేలా చేస్తుంది.." అని వక్కాణించవచ్చునేమో.

ఏదయితేనేం జోగారావుని దారుణంగా తిట్టుకుంటూనే అందరికీ కామన్‌గా ఉన్న నున్నటి బోడిగుళ్లు కాకుండా ఇంకా తమ వద్ద ఏమున్నాయోనని అర్జనగిరి బ్యాచంతా బోడి బుర్రలు బద్దలు గొట్టుకుని ఆలోచించింది. ఫలితంగా మగాళ్ల మెడల్లో వెండి తావీదులున్నాయని గ్రహించింది. ఆడవాళ్ల ముక్కులకీ చెవులకీ బంగారప్పిసరూ పిప్పీ ఉందని గుర్తించింది. వెనువెంటనే వాటిని మార్వాడి కొట్లో తెగనమ్మకుంది. 'అదునుకి బంగారం - ఆలికి సింగారం' సిద్ధాంతం ఒంటికి పట్టగా రేణిగుంట రాగలిగింది. రైలెక్కగలిగింది. మర్నాటి ఉదయం అనకాపల్లి చేరగలిగింది. పిమ్మట చోడవరం మీదుగా అర్జనగిరి పోగలిగింది. వెళ్లి వెళ్లి తిన్నగా మునసబు వెంకటేశ్వర్లు ఇంటినే ముందుగా తాకగలిగింది. అక్కడే దులిపి దుకాణం పెట్టగలిగింది.

"మీ బామ్మరిది గోరు ఇలగసెయ్యడం బాగున్నాదా. దేవుడి దగ్గరికి తీసికెల్తానని సెప్పి నానా సంకలూ నాకించీడం నాడెవయిన పద్దతేనా. ఏటీ గోరం" అని ఘొల్లు ఘొల్లు పెట్టింది.



మునసబు వెంకటేశ్వర్లు తగుమనిషి. మెత్తటి మనిషి. బావమరిది ఎంతటి పోరంబోకో తెలిసిన మనిషి. కాకపోతే, యాత్రకి బయలుదేరేముందు ఎవరూ తనకీ విషయం చెప్పకుండా ఇప్పుడు తన దగ్గరకొచ్చి ఏడుస్తున్నారేంటన్నదే ఆయన బాధ. పైగా పొద్దున్న పొద్దున్నే ముక్కులకీ చెవులకీ ఏమీ లేకుండా డెక్కించుకున్న బుర్రలతో అంతమంది ఆడజనం తన ఇంటి మీద పడిపోవడంతో అయోమయం పాలయ్యాడు. వీళ్ల అవతారాలు భయంగొల్పుతున్నట్టుగా కూడా భావించి భీతావహం చెందిపోయాడు. బిక్కచచ్చిపోయి తెత్తెత్తా.. నెన్నెన్నా.. అంటుండగా ఆయన భార్య వల్లితల్లి రంగంలోకి దిగిపోయింది. అసిరమ్మలా లగ్గలకెత్తిపోయింది. అమ్మో ఆవిడ చాలా గట్టిది. ముదూరు బొట్ట. జోగారావుకి అప్ప. అప్పుడిక ఆమె గారు పేద్ధ నోరేసుకుని,

"ఆ జోగారావు గాడు పుణ్యం ఇప్పిస్తానంటే పారెళ్లేరా. అప్పుడు బాగుందేం. ఇప్పుడు వాడేదో చేస్సేడని ఫిర్యాదు చేస్తారా. ఎవర్రా మీరంతాను. మా ఇంటిమీదికి రావడానికి మీకున్న హక్కేంట్రా. ఎవడికి డబ్బు దొబ్బబెట్టేరో వాణ్నే వెళ్లి అడగండ్రా. వేళాకోళం చేస్తున్నారేంటి. మునసబంటే మీకంటికి అణాకాణీలా కనబడుతున్నాడేం. పోలీసులకి చెప్పి బొక్కలో తోయించీగలను. మా దగ్గర ఆ రూల్సున్నాయి" మేజిస్ట్రేట్ పవర్స్ గుర్తుతెచ్చుకుని విరుచుకు పడిపోయింది. ఎప్పుడయితే పోలీసుల మాట పైకి తేలిందో రైతులందరూ జడిసిపోయారు. పెళ్లాలకు సర్దిచెప్పుకున్నారు. జోగారావుని తిట్టుకుంటూనే కిక్కు కక్కుమనకుండా ఇళ్లకి పోయారు. ఆ రకంగా వాళ్ల తిరుపతి యాత్ర పరిసమాప్తమయింది. ఆ విధంగా వాళ్లకు దేవుడు కనిపించేశాడు.

• • •

ఇదండీ! మా జోగారావు ఘనత. అలాంటి జోగారావు బాబు మళ్లీ అర్జనగిరి రాలేదా ... అంటే ఎందుకు రాలేదు! సుబ్బరంగా వచ్చాడు. పెళ్లాంతో కలిసే వచ్చాడు. కాకపోతే చాలాకాలం తర్వాత వచ్చాడు. అప్పటికి రాజెవడో మంత్రెవడో. అర్జనగిరి యాత్రికులకు అంతకాలం వాడి మీద కోపం ఎందుకుంటుంది. ఒకరికో ఇద్దరికో మనసులో కసి ఉన్నా వాళ్ల కష్టాల్లో వాళ్లు కొట్టుకుంటూ కిమ్మనలేదు. అలా వాడు బచాయించిపోయాడు. నాగిలాగ ముఖం పెట్టి నవ్వులు కురిపించాడు.

అందుకే నేనంటాను -

ఎప్పుడూ మహనీయుల గురించే కాదు. అప్పుడప్పుడు ఇలాంటి మహా మహా మహనీయుల గురించీ మనం తెలుసుకోవాలి. చెడ్డగురించి తెలిస్తేనే మంచి మన బుర్రకి పడుతుంది. అవునట్టు! మీ పక్కన గానీ మీ ఊళ్లోగానీ ఇలాంటి జోగారావులు ఉన్నారేంటో చూసుకోండి. ఉంటే మాత్రం జాగ్రత్త సుమా! వాళ్లతో యాత్రలకీ గట్రా బయల్దేరకండేం..!

రచయిత సెల్ : 88971 47067

# కరివేపాకుతో...

ఫుడ్ కోర్ట్

## చికెన్ కర్రీ

**కావలసిన పదార్థాలు**

చికెన్ - అరకేజీ, ఉల్లిపాయలు - 2, అల్లం వెల్లుల్లి పేస్టు - ఒక టేబుల్ స్పూను, ఉప్పు - రుచికి తగినంత, నూనె - 3 టేబుల్ స్పూన్లు, కరివేపాకు - ఒక కప్పు, పచ్చి మిర్చి - 3, జీడిపప్పు - 10, ధనియాలు - ఒక టేబుల్ స్పూను, గరం మసాల పొడి, పసుపు - ఒక టీ స్పూను చొప్పున, కారం - ఒక టేబుల్ స్పూను, పచ్చికొబ్బరి తురుము - ఒక టేబుల్ స్పూను, కొత్తిమీర తరుగు - అరకప్పు.

**తయారుచేసే విధానం**

ఒక టేబుల్ స్పూను నూనెలో జీడిపప్పు, ధనియాలు, కరివేపాకు, పచ్చిమిర్చి ఒకటి తర్వాత ఒకటి వేగించి, చల్లారిన తర్వాత పచ్చికొబ్బరి తురుముతో పాటు పేస్టు చేసుకొని పక్కనుంచాలి. ఇప్పుడు మిగతా నూనెలో ఉల్లిపాయ తరుగు దోరగా, అల్లం వెల్లుల్లి పేస్టు పచ్చివాసన పోయేవరకు వేగించాలి. తర్వాత కారం, పసుపు, గరం మసాలా పొడి, ఉప్పు వేసి రెండు నిమిషాల తర్వాత చికెన్ ముక్కలు జత చేయాలి. నీరంతా ఆవిరయ్యాక కరివేపాకు మిశ్రమం, కొద్దిగా నీరు కలిపి మూతపెట్టి ఉడికించాలి. చికెన్ మెత్తబడ్డాక కొత్తిమీర తరుగు చల్లి దించేయాలి. ఈ కర్రీ రైస్ / పరాటాలతో బాగుంటుంది.



## పచ్చడి

**కావలసిన పదార్థాలు**

కరివేపాకు - 4 కప్పులు, చింత పండు - ఒక రెబ్బ, నూనె - 6 టేబుల్ స్పూన్లు, ఆవాలు, మిన ప్పప్పు, మెంతులు - ఒక టీ స్పూను చొప్పున, ఎండు మిర్చి - 6, ఇంగువ పొడి - పావు టీ స్పూను, ఉప్పు రుచికి తగినంత.

**తయారుచేసే విధానం**

4 టేబుల్ స్పూన్ల నూనెలో ఆవాలు, మినప్పప్పు, మెంతులు, ఎండు మిర్చి, ఇంగువ పొడి దోరగా వేగించి పక్కనుంచాలి. అదే కడాయిలో కరివేపాకు వేసి 2 నిమిషాలు వేగించాలి. చల్లారిన తర్వాత చింతపండు రెబ్బ, ఉప్పుతో పాటు అన్నీ కలిపి మిక్సీలో (అవసరమైతే నీళ్లు చిలకరించి) రుబ్బుకోవాలి. ఈ పేస్టుని మిగతా నూనెలో పచ్చివాసన పోయేవరకు వేగించాలి. ఇష్టమైతే విడిగా పోపు జత చేసుకోవచ్చు. వేడి వేడి అన్నంతో ఈ పచ్చడి చాలా రుచిగా ఉంటుంది.

## దోశలు

**కావలసిన పదార్థాలు**

(మినప్పప్పు+బియ్యం కలిపి రుబ్బిన) దోశల పిండి - మూడు కప్పులు, కరివేపాకు - ఒక కట్ట, పచ్చిమిర్చి - ఒకటి, జీలకర్ర - అర టీ స్పూను, ఉప్పు - చిటికెడు.

**తయారుచేసే విధానం**

మిక్సీలో శుభ్రం చేసిన కరివేపాకు, జీలకర్ర, ఉప్పు, పచ్చిమిర్చి వేసి మెత్తగా రుబ్బుకోవాలి. తర్వాత ఈ మిశ్రమాన్ని పిండిలో వేసి బాగా కలిపి దోశలు వేసుకుని రెండు వైపులా కాల్చుకోవాలి. ఈ దోశలకు అల్లం పచ్చడి మంచి కాంబినేషన్. దోశలు చూడ్డానికి ఆకుపచ్చగా అందంగా కనిపించడంతో పిల్లలు కూడా ఇష్టంగా తింటారు.





















# విసుర్రాయి- ఉప్పు కథ

అనగనగా ఒక ఊళ్లో శ్యాము, రాము అనే అన్నదమ్ములు ఉండేవారు. శ్యాము బాగా సంపాదించి, సంతోషంగా తన కుటుంబంతో గడుపుతుండే వాడు. రాము మాత్రం గుప్పెడు తిండికే నానాకష్టాలు పడుతుండేవాడు.

ఒకరోజు రాము, అన్న దగ్గరి కెళ్లి తన కష్టాల గురించి చెప్పి, సాయం చేయమని అడిగాడు. దానికి శ్యాము ససేమిరా అన్నాడు. బాధతో వెళుతున్న రామును ఒక ముసలాయన చూసి, దగ్గరికి పిలిచి "నాయనా... ఈ కట్టెల మోపును మా ఇంటిదాకా మోసుకెళ్తే నీకు అవసరమైన సాయం చేస్తాను" అన్నాడు. రాము కాదనకుండా  సాయం చేశాడు. అప్పుడా పెద్దాయన రాముకు ఒక రొట్టెను ఇచ్చి, "దీన్ని తీసుకెళ్లి దక్షిణతీరపు అడవుల్లో ఉన్న నా కుమారుడికి ఇస్తే, వాడు నీవేమడిగినా ఇస్తాడు. కానీ గుర్తుంచుకో! డబ్బు మాత్రం తీసుకోకు, దానికి బదులు విసుర్రాయి అడుగు" అని చెప్పాడు. ఆ పెద్దాయన చెప్పినట్టే చేశాడు రాము. ఆయన కుమారుడు విసుర్రాయిని ఇస్తూ "దీన్ని తిప్పుతూ నువ్వేం అడిగితే, అది వస్తుంది. కానీ గుర్తుంచుకో! ఈ రాయి తిరగడం ఆపాలంటే ఎర్రని వస్త్రం కప్పాలి" అని చెప్పాడు.

రాము, ఆ విసుర్రాయిని ఇంటికి తీసుకెళ్లి "విసుర్రాయీ... విసుర్రాయీ... నాకు ధాన్యం కావాలి" అని అడిగాడు. వెంటనే ఆ విసుర్రాయిలోనుంచి రాశులు రాశులుగా ధాన్యం వచ్చింది. కావల్సినంత రాగానే రాయిపై ఎర్రని వస్త్రం కప్పేశాడు రాము. తర్వాత పప్పులు, పొడులు, దినుసులు కోరాడు. ఆ రోజు కుటుంబమంతా కలిసి పప్పూ, కూరలూ వండుకుని హాయిగా తిన్నారు. తర్వాతి రోజు మిగిలిన ధాన్యాన్ని, పప్పు, దినుసులను మార్కెట్లో అమ్మాడు రాము. అలా కొన్ని రోజులకు శ్యాము కంటే ఎక్కువ డబ్బూ, ఆస్తులూ సంపాదించాడు. ఇది చూసిన అన్నకు, తమ్ముడిపైన ఈర్ష్య పుట్టింది. అసలు రాముకు ఇంత డబ్బు ఎలా వస్తుందో తెలుసుకోవాలని, అతని ఇంట్లోకి వెళ్లి నక్కిచూశాడు. విసుర్రాయి నుంచి కుప్పలు, కుప్పలుగా ధాన్యం వస్తుండడం చూసి, దాన్ని ఎలాగైనా దొంగిలించాలనుకున్నాడు. రాము మార్కెట్‌కు వెళ్లినప్పుడు, విసుర్రాయిని దొంగిలించి, తన ఆస్తులన్నీ వదిలేసి కుటుంబాన్ని తీసుకుని, పడవలో పయనమయ్యాడు.

అప్పుడు శ్యాము భార్య "ఈ విసుర్రాయి కోసమా... ఆస్తులన్నీ వదిలేసింది. ఛీ" అని విసుక్కుంది. విసుర్రాయి మహత్తుని భార్యకు చూపిద్దామనుకుని "విసుర్రాయీ.. విసుర్రాయీ నాకు ఉప్పు కావాలి" అన్నాడు.

వెంటనే రాయిలోంచి ఉప్పు రావడం మొదలైంది. ఆనందించిన శ్యాము భార్య, పడవ నిండా ఉప్పు నిండుతుండడం చూసి, ఇక ఆ రాయిని ఆపమని అరిచింది. ఎలా ఆపాలో తనకు తెలియదన్నాడు శ్యాము. ఏం చేయాలో తెలియక విసుర్రాయిని సముద్రంలో విసిరేశాడు.

దురాశతో ఉన్న ఆస్తులనూ, దొంగిలించిన విసుర్రాయిని పోగొట్టుకుని, కష్టాలపాలయ్యాడు శ్యాము. అయితే సముద్రంలో పడిన విసుర్రాయి మాత్రం ఇంకా అలా తిరుగుతూనే ఉందనీ, అందుకే సముద్రపు నీళ్ల అంత ఉప్పగా ఉంటాయనీ ఓ నమ్మకం.





## ఆపేక్ష... ది ఫ్యాషన్ డిజైనర్

వయ్యారంగా నడుస్తున్న మోడల్స్ మధ్య, దర్జాగా నడిచివస్తున్న ఈ చిన్నారి పేరు ఆపేక్ష బినోజ్. కేరళలోని త్రిసూర్‌లో పుట్టిన ఆపేక్ష, దేశంలోనే అతిచిన్న వయసున్న ఫ్యాషన్ డిజైనర్ (అమ్మాయి)గా రికార్డు సాధించింది. ఏడేళ్ల వయసు నుంచే రకరకాల కాస్ట్యూమ్స్ డిజైన్స్ వేయడం మొదలుపెట్టిన ఆపేక్ష, దుబాయ్‌లోని ఓ ఫ్యాషన్ ఇన్‌స్టిట్యూట్‌లో మొదటి అంచె ఫ్యాషన్ డిగ్రీ పరీక్షలు కూడా పాసయ్యింది. ఇప్పటికే 105కు పైగా డిజైన్లను రూపొందించిన ఆపేక్ష, ప్రస్తుతం దుబాయ్‌లో తల్లిదండ్రులతో ఉంటోంది. ఎన్నో ర్యాంపు షోల ద్వారా తనకంటూ ఓ బ్రాండింగ్ ఏర్పరచుకున్న ఈ చిన్నారికి, 'యూఆర్‌ఎఫ్ నేషనల్ రికార్డ్స్', 'వరల్డ్ రికార్డ్స్ ఇండియా', 'అసిస్ట్ వరల్డ్ రికార్డ్స్' గుర్తింపు లభించింది. ఫ్రాన్స్‌లో ఫ్యాషన్ డిజైనింగ్ మాస్టర్స్ డిగ్రీ, డాక్టరేట్ కూడా పూర్తి చేయాలని ఉందంటోన్న ఆపేక్ష వయసు ప్రస్తుతం పన్నెండేళ్లు.

## రంగులు వేయండి



| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| onion |  | f | i | r | e | p | l | a | c | e |
| patio |  | e | i | h | c | a | m | e | r | a |
| pepper |  | s | x | n | l | x | o | e | v | r |
| camera |  | a | p | a | g | i | n | o | e | e |
| napkin |  | c | g | p | a | t | i | o | g | p |
| veggies |  | k | v | k | v | v | o | l | g | p |
| bookcase |  | o | s | i | r | p | n | q | i | e |
| fireplace |  | o | r | n | i | p | c | i | e | p |
| | | b | r | w | a | p | z | a | s | d |

## తేడాలు కనిపెట్టండి?






### జవాబులు

విలువ ఎంత? 17
తేడాలు కనుక్కోండి:
టోపీలో ఉన్న గుర్తు,
పళ్లెంలో పువ్వు,
సాస్‌బాటిల్ మూత రంగు

## కుక్క మూతి 'కోటి' గాడు

నోరూ, మొహమూ కుక్కలా, శరీరం ముంగిసలా ఉంది... ఏమిటిదీ అనుకుంటున్నారా? దీని పేరు కోటిమండీ (coatimundi). నల్లని చారల తోక ఉండే దీన్ని 'కోటీ' అనీ, 'కుక్కమూతి ముంగిస' అనీ, 'మెక్సికన్ టేజోన్' అనీ రకరకాల పేర్లతో పిలుస్తారు. ఇవి దక్షిణ అమెరికా, మధ్య అమెరికా ప్రాంతాల్లో, అమెజాన్ అటవీ ప్రాంతంలో ఎక్కువగా కనిపిస్తాయి. 33 సెంటీమీటర్ల నుంచి 69 సెంటీమీటర్ల పొడవుండే ఈ జీవులు, 8 కిలోల దాకా బరువు పెరుగుతాయి. ఆడవాటి కంటే మగ జంతువులు దాదాపు రెట్టింపు సైజులో ఉంటాయి. మగ జంతువులకు వేటాడేందుకు ప్రత్యేకంగా పదునైన రెండు కోర పళ్లు కూడా ఉంటాయి. ఇవి పండ్లు, గింజలతో పాటు పక్షుల గుడ్లు, మొసళ్ల గుడ్లు, బల్లులు, సాలెపురుగులను ఆహారంగా తీసుకుంటాయి.





నేను అంటే - హైదరాబాద్‌లోని ఉద్యోగి, విజయవాడలోని వ్యాపారి, ముంబయిలోని శ్రామికుడు, కశ్మీర్‌లోని కళాకారుడు... ఎవరైనా కావచ్చు! ఆ నేనులన్నీ కలిస్తే... మనం. ఆ 'మనం' గుండెల్లో కదలిక వస్తే మానవత్వం! అయినా, అర్థం కాకపోతే ఏదో ఓ 'మెడికల్ క్రౌడ్ ఫండింగ్' వెబ్‌సైట్‌లోకి వెళ్లండి. ప్రాణాంతక వ్యాధులతో బాధపడుతున్న చిన్నారుల కథలు చదవండి.

# మేమున్నామనీ.. మీకేం కాదనీ!

క్యాన్సర్ భూతం కావచ్చు. అంతకుమించిన అనారోగ్య భేతాళం కావచ్చు. వైద్యం పక్కా వ్యాపారంగా మారిపోయిన వ్యవస్థలో ఆ రోగ పీడితుల్ని ఎవరు కాపాడతారు? కార్పొరేట్ ఆసుపత్రులకు నువ్విచ్చే డబ్బే కావాలి. వైద్యులకు నీ చికిత్సలూ శస్త్రచికిత్సల ద్వారా ముట్టే కమిషన్ కావాలి. కనీస వసతుల్లేని సర్కారీ దవాఖానాలు చిన్నాచితకా వైద్యాలు కూడా సమర్థంగా చేయలేకపోతున్నాయి. ఇక, ప్రాణాంతక వ్యాధులైతే... రేపు ఆరిపోవాల్సిన దీపం, ఈరోజే కొడిగట్టడం ఖాయం. ఈ పరిస్థితుల్లో ఎవరు ఆదుకుంటారు?

స....మా...జం!

అవును సమాజమే! సమాజానికి... గుండె లేదని ఎవరన్నారు? స్పందించడం చేతకాదని ఎవరు తీర్మానించారు? సమాజం గుండె కూడా లబ్‌డబ్‌మని కొట్టుకుంటుంది. సమాజం మనసు కూడా సమస్యలకు కరిగిపోతుంది, కన్నీరవుతుంది. ఆ స్పందనల్ని తెలుసుకోవాలంటే... క్రౌడ్ ఫండింగ్ వేదికల్ని ఓసారి పరామర్శించి రావాలి. ఎక్కడో ఓ మారుమూల పల్లెలో పేరుతెలియని ప్రాణాంతక వ్యాధితో బాధపడుతున్న ఓ చిన్నారి కథ, మహానగరంలోని మురికివాడలో ఊపిరిబిగబట్టుకుని బతుకీడుస్తున్న ఓ దురదృష్టవంతురాలి గాథ... ఎమర్జెన్సీవార్డు రోగుల్లా వరుసబెట్టి కనిపిస్తాయి. ఆ అక్షరాలు కవితాత్మకంగా లేకపోవచ్చు. ఆ భావాల్లో గాఢత తక్కువే కావచ్చు. అయితేనేం, జీవం ఉంటుంది. అదే వేల మనసుల్ని కదిలిస్తుంది. బెంగళూరులోని ఓ వైద్యశాలలో మృత్యువుతో పోరాడుతున్న తమ స్నేహితురాలికి సాయం చేయమంటూ హైదరాబాద్‌కు చెందిన తోబుట్టువులు క్రౌడ్‌ఫండింగ్ వేదిక 'మిలాప్'లో అభ్యర్థన పెట్టారు. దాదాపు లక్షా ముప్పైవేలమందిలో ఒకరికి వచ్చే మాయదారి రోగమది. వైద్యానికి పాతిక లక్షల రూపాయల దాకా ఖర్చు అవుతుందని డాక్టర్లు లెక్క తేల్చారు. దిగువ మధ్యతరగతికి పాతిక లక్షలంటే... జీవితకాలం సంపాదన, అంతకంటే ఎక్కువే? ఎక్కడి నుంచి తెస్తారు? దోస్తుల చొరవతో క్రౌడ్‌ఫండింగ్ వేదిక మీద ఆ సమస్య ప్రస్తావనకు వచ్చింది. చాలా డబ్బే సమకూరింది. చికిత్స నిరంతరాయంగా జరిగిపోతోంది.



**వైద్య నారాయణులూ...**

ఏమాటకామాటే చెప్పుకోవాలి. వైద్యం ఎంత వ్యాపారమయమైపోయినా...గుండెల్లో తడి కలిగిన డాక్టర్లు ఇంకా ఉన్నారు. అక్కడక్కడా తారసపడతారు. ఆ వైద్య నారాయణులు.... 'శస్త్రచికిత్సకు ఇంత, మంచానికి ఇంత, మందులకు ఇంత....' అంటూ అంచనాల కాగితం చేతిలోపెట్టి బాధ్యత తీరిపోయిందని అనుకోరు. పెట్టకపోయినా, పెట్టే ఇల్లు చూపించమన్నారు పెద్దలు. వాళ్లు ఆ పనే చేస్తున్నారు. 'ఫలానా క్రౌండ్ ఫండింగ్ వెబ్‌సైట్‌లో వివరాలు పెట్టండి. ఏ దాతలో స్పందించకపోరు' అంటూ ఓ దారి చూపుతున్నారు. మిలాప్ లాంటి వేదికలైతే తామే వైద్యుల దగ్గరికి వెళ్లి మరీ, పెద్ద ఆపరేషన్లు అవసరమైన రోగుల సమాచారం తెలుసుకుంటున్నాయి. ఆరేళ్ల వివాన్ విషయంలో అదే జరిగింది. ఆ పసివాడికి క్యాన్సర్. చికిత్స కోసం అమ్మానాన్నా అప్పటికే పదిలక్షలు ఖర్చుపెట్టారు. పైసాపైసా కూడబెట్టి... పొదుపు చేసుకున్న డబ్బు ఖర్చయిపోయింది. ఆత్మీయుల చేబదుళ్లు ఆగిపోయాయి. ఒంటి మీది నగలు కుదువ వ్యాపారుల చేతికెళ్లిపోయాయి. అయినా, చికిత్స పూర్తికాలేదు. నిజానికి ఇదే కీలకమైన దశ. ఆ సమస్యను వైద్యుడు అర్థం చేసుకున్నాడు. 'మిలాప్'కు పరిచయం చేశాడు. ఎక్కడెక్కడి దాతలో స్పందించి పది లక్షల దాకా సమకూర్చారు. పసివాడు ఇప్పుడిప్పుడే కీమో నుంచి తేరుకుంటున్నాడు. ఒక్క మిలాప్ ద్వారానే ఇప్పటిదాకా దాదాపు మూడువందల యాభైమంది రోగులకు నిధులు సమకూరాయి. 'కెట్టో' అనే వేదిక మీద... ప్రాణాంతకమైన వ్యాధితో బాధపడుతున్న ఓ రోగి విన్నపానికి మన్నించి...కోటి రూపాయల దాకా సమకూర్చారు దాతలు. ప్రపంచం నలుమూలల నుంచీ వేయి రూపాయల మొదలు పదీ పాతిక లక్షల దాకా... తలో చేయీ వేశారంతా. బిట్ గివింగ్, క్రౌడ్ ఎలా మొదలైన క్రౌడ్‌ఫండింగ్ సంస్థలూ రోగులకు తమవంతు సాయం చేస్తున్నాయి. కాకపోతే, క్రౌడ్ ఫండింగ్ ద్వారా వసూలైన మొత్తంలో కొంత శాతాన్ని నిర్వహణ వ్యయంగా తీసుకుంటాయా వేదికలు. నిధుల సేకరణలో ట్విటర్, ఫేస్‌బుక్ లాంటి సామాజిక మాధ్యమాల్ని సమర్థంగా ఉపయోగించుకుంటూ... ప్రచారాన్ని జనంలోకి తీసుకెళ్తాయి. ఉద్దేశం మంచిదే కావడంతో, ప్రచార మాధ్యమాలూ అండగా నిలుస్తున్నాయి. 'చిన్న పిల్లల విషయంలో ప్రజల స్పందన అనూహ్యంగా ఉంటోంది. పెద్దలతో పోలిస్తే చిన్నారులు క్యాన్సర్ నుంచి బయటపడే అవకాశాలు ఎక్కువ. అందుకే, డాక్టర్ల వైపు నుంచి కూడా చొరవ పెరుగుతోంది' అంటారు ఓ క్రౌడ్‌ఫండ్ సంస్థ ప్రతినిధి. ఆన్‌లైన్‌తో ప్రపంచమంతా ఓ కుగ్రామంగా మారిందని అంటూ ఉంటారు. కాదుకాదు... ఓ ఉమ్మడి కుటుంబంగా మారింది! ✻

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో 'అలర్జిక్ బ్రాంకైటిస్' సమస్యకు సరైన వైద్యం



**డా. శ్రీకాంత్ మోర్లావర్**
CMD
**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్**

మారుతున్న ఆధునికతతో పాటు రోజురోజుకూ తీవ్రంగా పెరుగుతున్న వాతావరణ కాలుష్యం వలన మన శరీర అవయవాలు దుష్ప్రభావాలకు గురి అవుతున్నాయి. అందులో ప్రధానమైనవి శ్వాసకోశ ఇబ్బందులు. అందునా బ్రాంకైటిస్ సమస్యతో చాలా ఎక్కువ మంది బాధపడటం జరుగుతోంది.

సాధారణంగా వాతావరణంలోని గాలిని మనం పీల్చుకున్నప్పుడు అది ముక్కు ద్వారా వెచ్చగా మారి, నీటి ఆవిరిని కూడా కలుపుకుని ట్రకియా అనే శ్వాసనాళంలోకి ప్రవేశిస్తుంది. దాని చివరి భాగం 2 నాళాలుగా చీలి ఉంటుంది. వీటిని 'బ్రాంకై' అని అంటారు. ఈ 'బ్రాంకై' విడివిడి చీలికలుగా ఛాతీ కుహరంలో ఇరువైపులా ఉండే ఊపిరితిత్తులలోకి ప్రవేశించి కొన్ని వేల సంఖ్యలో చిన్నని-అతి సన్నని నాళాలుగా విభజింపబడతాయి. వీటిని 'బ్రాంకియోల్స్' అని అంటారు. ఈ నాళాలు మిక్కిలి తక్కువ పరిమాణం గల గుండ్రని వాయుతిత్తులుగా ఏర్పడతాయి. వీటిని ఆల్వియోలై అని అంటారు. ఈ శ్వాసనాళాల లోపలి భాగంలో ఒక శ్లేష్మపు పొర ఉంటుంది. ఏదైనా కారణం చేత ఇది శోథమునకు గురి కాబడిన సమస్యనే 'బ్రాంకైటిస్' అని అంటారు.



**అలర్జిక్ బ్రాంకైటిస్ అనగా:** ఏదైనా అలర్జీ కలిగించే పదార్థాలు వాయుద్వారాలను చేరినప్పుడు బ్రాంకై మరియు ఇతర దిగువ వాయుద్వారాలు శోథమునకు గురి కావడాన్ని 'అలర్జిక్ బ్రాంకైటిస్' అని అంటారు. ఈ సమస్య ఏ వయస్సు వారిలోనైనా కనిపిస్తుంది. నాన్ అలర్జిక్ బ్రాంకైటిస్ అనేది బ్యాక్టీరియా లేదా వైరస్‌ల వలన కలుగుతుంది.

మన శరీరానికి సరిపడని పదార్థాలను గాలి ద్వారా పీల్చుకున్నప్పుడు - వాయుద్వారాలు వాటికి బలంగా స్పందిస్తాయి. ఇలా స్పందించిన వాయుద్వారాల కండరాలు బిగించుకోబడతాయి. దీని వలన వాయుద్వారాలు కాస్త సన్నగా మారుతాయి. తదుపరి అవి శోథమునకు గురి అయి వాపు చెందడం ద్వారా మరియు సాధారణ స్థాయికి మించి శ్లేష్మాన్ని ఉత్పత్తి చేయడం వలన, అవి మరింత ఇరుకుగా మారి గాలి ప్రసరణకు ఆటంకాలు ఏర్పడటం వలన 'ఆస్థమా' లక్షణాలు ఏర్పడతాయి.

**కారణాలు:** ఏదైనా అలర్జీ కలిగించే పదార్థాలు శ్వాస ద్వారా వాయుద్వారాలలో ప్రవేశించినప్పుడు, బ్రాంకియల్స్ రోగనిరోధక వ్యవస్థ సాధారణ స్థితికి మించి ఎక్కువగా ప్రతిక్రియ జరపడంతో 'అలర్జిక్ బ్రాంకైటిస్' సమస్య కలుగుతుంది. • పొగ త్రాగటం, దుమ్ము, వాతావరణ కాలుష్యం, బూజు, కొన్ని రసాయనాలు, వృత్తిరీత్యా కొన్ని వాయు కాలుష్యాలను ఎదుర్కోవడం, జంతు చర్మపు పొరలు, శ్వాసకోశ అలర్జీని ప్రేరేపించే కొన్ని ఆహార పదార్థాలు మరియు జన్యుపరమైన అంశాలన్నీ ఈ సమస్యకు కారణాలు అవుతాయి. **లక్షణాలు:** ఈ సమస్యలో కనిపించే ప్రధానమైన లక్షణం దగ్గు. కఫంతో కూడి లేదా కఫం లేకుండా కలిగే ఈ దగ్గు రాత్రి సమయంలో ఎక్కువగా ఉంటుంది. • ఊపిరి ఆడకపోవడం వంటి లక్షణం కనిపించినప్పుడు నిర్లక్ష్యం చేయకూడదు. ఈ సమస్య తీవ్రరూపం దాలిస్తే పని సమయాలలోనే కాకుండా విశ్రాంతి సమయంలో కూడా ఈ లక్షణం ఏర్పడి ప్రాణాంతకంగా మారవచ్చు. • పిల్లి కూతలు, నీరసం, ఛాతీలో నొప్పి, గొంతు నొప్పి, తల నొప్పి, పెదాల వాపు, అప్పుడప్పుడూ చర్మం నీలం రంగులోనికి మారడం మొదలగు లక్షణాలను గమనించవచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** రోగి లక్షణాలను బట్టి ఛాతీ ఎక్స్‌రే, కఫం పరీక్ష, రక్త పరీక్ష, కొన్ని సందర్భాలలో ఊపిరితిత్తుల ఆకారం, వాటి పనితీరు స్పష్టతకై సి.టి. స్కాన్, PFT పరీక్షలు, అలర్జీ పరీక్షలు నిర్వహించవలసి వస్తుంది. **దుష్ప్రభావాలు:** ఈ వ్యాధి దీర్ఘకాలికంగా కొనసాగితే COPD, శ్వాస తీసుకోవడంలో తీవ్రమైన ఇబ్బందితో శ్వాస ప్రక్రియ విఫలమై మరణానికి దారి తీయడం వంటి దుష్ప్రభావాలకు సైతం ఇది దారి తీస్తుంది. **తీసుకోవలసిన జాగ్రత్తలు:** దుమ్ము-ధూళి, ఇతర రసాయనాలు మరియు వృత్తిరీత్యా ఎదుర్కొనే వాయు కాలుష్యం శరీరంలోకి ప్రవేశించకుండా జాగ్రత్తలు తీసుకోవడం. • బెడ్‌లను-దుప్పట్లను శుభ్రంగా ఉంచుకోవడం. • పెంపుడు జంతువులకు, ధూమపానానికి మరియు ఇతర అలర్జీ కలిగించే పదార్థాలకు దూరంగా ఉండటం. • ప్రాణాయామం వంటి వ్యాయామాలు చేయడం ద్వారా ఈ 'అలర్జిక్ బ్రాంకైటిస్' నుండి కొంత వరకు ఉపశమనాన్ని పొందవచ్చును.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** 'కాన్స్టిట్యూషనల్ హోమియోపతి' విధానంలో భాగంగా, సూక్ష్మీకరణ పద్ధతిలో తయారైన హోమియో మందులతో శరీర రోగనిరోధక కణాలకు పునరుజ్జీవం కల్పించి, ఎలాంటి దుష్ప్రభావాలు లేకుండా 'అలర్జిక్ బ్రాంకైటిస్'ను పూర్తిగా నయం చేయవచ్చు. కేవలం 'హోమియోకేర్ ఇంటర్‌నేషనల్'లో మాత్రమే అందించబడే ఈ విశిష్ట వైద్య రీతిలో, వ్యాధి రీత్యా - రోగి శరీర నిర్మాణం, రోగి మానసిక, వ్యక్తిగత లక్షణాల పరిశీలన తదుపరి మాత్రమే అందించబడే ఈ హోమియో చికిత్సతో వ్యాధిని ప్రేరేపించే పదార్థాలు శరీరంలోకి ప్రవేశించినా వ్యాధి మళ్ళీ తిరగబెట్టకుండా సంపూర్ణంగా నయం చేయవచ్చు.




**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్**
వరల్డ్-క్లాస్ హోమియోపతి

టోల్ ఫ్రీ **1800 108 1212**

కన్సల్టేషన్ ఉచితం **955 000 1199**

www.homeocare.in

